Darbha Ramamurty
Brodipet
Guntur
1-5-42

సాహిత్యలత పోషకవర్గమునకు, అభిమానులకు, చందాదారులకు వందనములు. నూతన సంవత్సరము మీకు సౌఖ్యప్రదమగుగాక! ప్రజలలో భాషాభిమాన మభివృద్ధియగుగాక! దేశము పాడిపంటలతో తేజరిలుత!

సాహిత్యలతకు రెండవ వత్సరము నడచుచున్నది. దయయుంచి విరాళములు, చందాలు వెంటనే పంపవలసినదనిమనవి. ఈవిషయమున జాబులువ్రాయుట అధిక తపాలా వ్యయమునకు హేతువుగాన, సహృదయులగు మా చందాదారులిది గమనింతురుగాక!

ఇట్లు విధేయులు,
నిర్వాహకులు

"సాహిత్యలత"
7 వ కుసుమము.

# "కావ్యమాల."

గ్రంథకర్త:
కారుమంచి కొండలరావు,
బి. ఏ., బి. ఇ. డి.,

# " సాహిత్యలత "

—♦ రాజపోషకులు ♦—

మ. రా. శ్రీ "దేశోద్ధారక" "విశ్వదాత"
కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు.

,, ఊటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు.

,, శ్రీకాకుళం పట్టాభిరాములుగుప్త గారు.

,, "ఆంధ్రనాటక కళోద్ధారక"
వనారస గోవిందరావు గారు.

సురభినాట్యమండలి.

—♦ పోషకులు. ♦—

మ. రా. శ్రీ బూదరాజు వెంకటసుబ్బయ్యపంతులు గారు,
(స్వర్గ)

,, పులిపాటి కుమారస్వామి గారు,
బ్యాంకరు, గుంటూరు.

,, పి. సూర్యనారాయణగారు, బి. ఏ., చీరాల.

,, పేటేటి వెంకటాద్రిగారు, చీరాల.

,, తడవర్తి సీతారాం శ్రేష్ఠిగారు, ప్రెసిడెంటు,
రాజమండ్రి, నేషనల్ బ్యాంకు లిమిటెడ్.

,, ఊటుకూరి లక్ష్మీనృసింహదాసు గారు,
భూస్వాములు, వేటపాలెం.

,, నారపరాజు రామమూర్తిపంతులుగారు,
భూస్వాములు, ఇంకొల్లు

# ఆశీస్సులు.

"భారతీ" సంపాదకులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య గారి యొద్దనుండి.

శ్రీయుత కృష్ణరావుగారికి:—

ప్రియమహాశయా! వందనములు.

తమ లేఖ అందినది.

తాము ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసముకొఱకు 'సాహిత్యలత' ద్వారమున గట్టి కృషిచేయుచున్నారు. సాహిత్యలతయు క్రమముతప్పక, ఆ యా కాలముల, నవ్యకుసుమములను ప్రసవించుచున్నది. దీనినిబట్టి యీ "సాహిత్యలత" ముందుముందు, నవ్యామోద విలసితములగు కుసుమములను ప్రసవించుచు, నాంధ్రలోకమున కామోదమును కూర్ప గలదని తలప నవకాశముగలదు. ఈతలంపు సఫలమయి సాహిత్యలత చిరంజీవియగుగాక! ఆంధ్ర వాఙ్మయోద్యాన వనమున కది యలంకారమై వెలయుగాక!

# ఆశీస్సు.

"కవికోకిల" శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి యొద్దనుండి.

శ్రీయుత కర్లపాలెం కృష్ణరావుగారికి:—

సర్వవాఙ్మయవని మీరు నాటినట్టి
సరస 'సాహిత్యలత' కు వత్సరము చెల్లె,
ఆఱు పూవులు పూచె నాంధ్రాళిముదము
నంద, నిఁక మీఁద నిమ్మడియగాత కాపు!

సాహిత్యలత

ద్వితీయ వసంతము

# సంపాదకీయము.

"కృషితో నాస్తి దుర్భిక్షం"

కవితాకన్యక లూడిగము సల్పుచుండ, సుకవివ్రాతము "జే! జే!" యన, చిగురుజొంపముల నల్లారుముద్దుగ బెరుగుచుండిన, సాహిత్యలతాదేవికి ద్వితీయ వసంతము ప్రవేశించినది.

క్రీడారంగమగు సెలయేటిగట్టుల సాంధ్యరాగములతో దోబూచులాడినది. చిఱుమీనముల బలుకరించి, పరిచయ మేర్పరచుకొన్నది. కోయిల కూనలతో, ప్రేమగీతముల బాడుచు, గాలిబుడుతనితో సరసమాడినది. విద్యుల్లతతో స్నేహముజేసి, నల్లమబ్బుల నవ్వుల పాలుచేసినది,- వెన్నెల రాత్రులవిహరించుచు "మచ్చమాపుకొనుమని", జాబిల్లినిహె

చ్ఛరించినది. ప్రాతఃకాలమున గులాబీకన్నెలు మంచుబిందువుల కానుకలర్పించినది- కుసుమగంధములదానము జేసినది, కొంటె తుమ్మెదల మందలించినది.

“సాహిత్యలత” నాశ్రయించి, అనాగరికులు నాజూకునభ్యసించిరి, రాకాసురి తలదములు దిద్దుకొనిరి. మూఢాచారులు సంస్కర్తలైరి, విరసులు సరసులైరి.

అనిర్వచనీయానందముతో కాలముగడచినది.

ఇప్పటికిపండినపంట, కళాభివృద్ధికెంత మేలైనదో, ప్రయోజనమునకంత ప్రధానమైనది.

ఇది నవవసంతము ప్రాయముననుసరించి, అంగసౌష్టవమేర్పడినది. నడకలయొయ్యారము-నడవడిలో గొప్పందనము నుడికారమున తీయందనము, పెట్టనిసొమ్ములు- అలంకారముల నారి తేరిన యందకత్తెయైనది. ఈడువారికి గుణపాఠములు నేర్పుచు, పెద్దరిక మార్జించి రసికజనమనోభిరామమైనది.

అన్యభాషాయోషామణుల గమనమునందలి మెలుకువల నవలోకించి, జాతీయాశయముల మేళవించి రసవత్తరమగు రచనలు జేసినది.

వీటిని దిలకించి, భావి భాగ్యోదయ సూచనలని, యాజమాని మురియుచు, కష్టముఫలించినదని సంతసించుచున్నాను.

మహాకవుల యాశీస్సు లమోఘములుగదా? విజయ విరాజితులకు గలుగు సహజ సంతోషాతిరేకముల నుప్పొంగుచు, వివశమై, లేఖిని యీవాక్యముల వ్రాయ సాహసించినది. ఇంతకుమున్నే పలువురు పెద్దలు "జానని" నలయూపియుండుటకతన, దోషముండదని ధైర్యము.

ఈ ఋతువునకు కాగల కాపులో సిద్ధమైన పూర్వ "కావ్యమాల" కర్త, పట్టభద్రుడైన, యుత్సాహముగల యువకుడు.

రసికు లాఘ్రాణింపదగిన యీ కుసుమమున, రెక్కలు లలితములైనవి. పుష్పోడి మధురమైన పరిమళముగలది. కర్త నానామైన కథావస్తువుల సేకరించినాడు. పరిశీలనము కొనియాడదగును. సంస్కృతాంధ్రముల రెండింటియందును చొరవ గలిగి ధారాశుద్ధియేర్పడినది. మచ్చునకు "భిక్షుని"లో,

"ఆమెను జెక్కుటద్దములయందు గులాబులుపూచె,దన్మనో
జ్ఞాననమందు చంద్రికలుగాసె, శరీరసువర్ణపుష్పశో
భానిలయమ్ములన్ బహుసువాసన లల్లెడనాక్రమించె,జం
ద్రానన మేనియందు నెలబాల్యము రూపము జెందు వేళలన్"

ప్రకృతినుండి మానవు డుద్భవించెను. వీరిరువురు సన్నిహిత బంధువులు. ఈ కలయిక సత్యమగు సౌందర్యము. ఈ పద్యమున సౌందర్య వర్ణనము చక్కగనున్నది.

“వాడిన వాడకున్న నిదివాడునటంచు నెఱింగికూడ, నీ
వాడుకొనంగ నెంతు ప్రసవమ్ముగనుంగొని, మోహవృత్తితో
వాడనిపూవ్వకై వెదకు భారము( బూనుట నీవొకింతయున్
జూడవ దేమి? యీమఱపుచోద్యము, హా! పసిపాపవాయికన్!

“ప్రేమ బలిలో”

ఈవు ప్రేమించితివి దానికింత ప్రేమ
పరులుగూడ చూపింపగావలె నటంచు,
పాడువర్తకమున కేల పాటుపడెదు?-
ధరణి నుత్కృష్టగుణము వర్తకమ? చెపుమ!”

ప్రేమలోనుండు పవిత్రత- వర్తకమునసందు నీచత్వము చక్కగ చిత్రింపబడినది.

“ఏను జనిపోయినపుడు- నన్మృత్యుదేవ
తాసభాస్థలికీడ్చుక తరలునపుడు,
ఘనభయంకర నిబిడాంధకారమందు
అతివ! నీప్రేమ వెలుగు సాయమ్ము జేయు.”

“మునిమాపు”లో

కర్త నిస్సహాయుడుగాబోలు, పాపము!

"ఒక్కఁడ యీయనంత మహితోన్నత విశ్వమునందునెల్ల, నే
నొక్కఁడ యీపరిశాంతసముద్యోన్ముఖ నిష్ఠురమాయమునం
[దు, నే
నొక్కఁడ యీవిశాల మహదుగ్రనిరామయశూన్యమందు
నేనొక్కఁడ యాత్రసేతు నిటులొక్కఁడనై యొకతోడు
[లేక యే..."

అని విలపించుచు, ఆవేశపూరితుడయ్యెను.

ఇంక పాఠకులానందమనుభవించి, యానందింతురుగాక

చక్కగ ప్రూఫులుదిద్దుట కవకాశము లేకపోవుట అచ్చు తప్పులుండిన నుండవచ్చును. రాబోవుగ్రంథమున సవరించుకొనెదము

63 వ పేజీలో 1 వ పద్యమున,

"ఒక్కత్రోపున గట్టెక్కయు" అనుదానికిమారుగ

"ఒక్కత్రోపున నవలగట్టెక్కఁజేయు" అనియు,

63 వ పేజీ 4 వ పద్యమున,

"నాథ! పోవుచుంటివానన్నువీడి" అనుదానికి,

"నాథ! పోవుచునుంటివానన్నువీడి" అనియు,

గ్రహించవలెను.

సాహిత్యలత కార్యాలయము,
చీరాల.

కర్లపాలెం కృష్ణారావు,
సంపాదకుడు.

# ఆశీస్సు.

లలితగాథావధూధమ్మిల్ల- తలముఁజలము
సెంగఁగ్రై చేసి బాసిముకుళనవృత్తి
నలఘు పరిమళవ్యాప్త దిగ్వలయమగుచుఁ
బొలుచుఁగాత! సాహితిలతా పుష్పచయము.

*　*　*　*　*

ధరణిఁ గృష్ణశరస్థాపి- తంబకాన,
యీలతయు నిచ్చలుం గ్రొత్త లాలతాంత
వితతివిసరి సత్యావతి- పెరటిపారి
జాతమటుల నెగడునన- సందియంబె!.

1—1—36,
కొల్లూరు.

కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

ఇది మదీయాభివృద్ధి భావించిమిగుల
వత్సలత్వమ్ముఁ బ్రేమయుఁ బ్రకటముగను
దాల్చు నమ్మనుష్యాకార దైవతముల
కర్పణముసేయువాఁడ నత్యధికభక్తిఁ.

# భిక్షుణి.

అఖిలలోకమ్ములం గల యాయనంత
దివ్యసౌందర్యమే యామె దేహమందు
రూపుగాంచినయది యెవ్వరును దదీయ
వైభవమ్మును వర్ణించువారు లేరు.

వదనకమలమ్మునకుఁ గ్రొత్త ప్రతిభ నిచ్చె
అంగములకెల్ల వింతసోయగ మొసంగెఁ
జూపులన్ భావములఁ గ్రొత్త సొగసుఁ గూర్చె
ఆమెనే నిలయమ్ము చేయంగఁ బోలు
ప్రణయదేవత యాకమలాసుతుండు.

ఆనును చెక్కుటద్దములయందు గులాబులు పూచెఁ, దన్మనో
జ్ఞాననమందు చంద్రికలు గాసె, శరీరసువర్ణపుష్పశో
భానిలయమ్ములన్ బహుసువాసనలెల్లెడ నాక్రమించెఁ, జం
ద్రాననమేనియందు నెలఁ బ్రాయము రూపము దెంచు వేళలన్.

బుద్ధదేవుని పాదసంపూజనమ్ము
సలిపి నిర్వాణపదమందఁ దలఁచెనామె,
సొచ్చిసారనట్టి ప్రియంపుసోయగమ్ము
దాఁగికొనెను, గాషాయవస్త్రముల తెరల.

పథికజనుల మానమ్మును ప్రాణధనముఁ
గొల్లఁగొట్టు నల్లరిమూక కెల్ల వాఁడు
రాజు, వసియించువాఁడా యరణ్యసీమ,
తనువుదాల్చినవికృత తత్వమ్మతండు.

అగ్రజన్ముండయయ్యు బాల్యమ్మునందె
అతఁడు చోరులహస్తమ్ములందుఁ బడియె
వారిమైత్రిని దస్కరవర్యుఁడయ్యె
కాలమెంతవారికిఁగూడఁ గడవరాదు.

లలితగతిన్ గమండలుజలమ్ములఁ ద్రోవనుజల్లుకొంచు, మం
జులఫణితిన్ బ్రశస్తగుణశోభితు బుద్ధునిఁ బాడుకొంచు, న
ర్మిలిని శిరీషకోమలశరీరకుమారి చనంగ, నిప్పు గ
న్నులు మెఱయంగ నాతఁడు గనుంగొనఁ
దారలుసంచలింపఁగన్.

కురులాకకొంతదాచినన గూడఁ బ్రవర్ధిలు నామెయాస్యసుం
దరరుచు, లాసరోజనయమ్ముల నిల్లును గట్టికొన్న ది
వ్యరుచిరకాంతిపూరము లనన్యజనప్రతిమానశోభలన్
గురిసెడి గండపాళికలు కోడు గనుంగొను జెప్పలార్ప కే.

సరసిజలమ్ములన్ మునిగి, చక్కఁగ దేహమునంటియున్న యాం
బరము నతిక్రమించి సుకుమారితనుద్యుతు లెల్లదిక్కులన్
మెఱయుఁగ నాలయమ్మునను మెట్టుల మెట్టుచునున్న వేళ, నా
సరసుఁడు నేత్రగోళములఁజాచి కనుంగొను

నామెరూపమున్.

పున్నమవెన్నెలల్ పుడమిముంచి వెలింగెడివేళ, దాపునం
దున్న సరత్తటమ్ములఁ బరుండి, తథాగతు పూజ్యపాదు న
భ్యున్నత సత్క్రపావిసరముల్ గళమెత్తిలతాంగి పాడఁ జెం
తన్నివసించి వాఁడు వినుదానిఁ జెవుల్ పొడిగించి శ్రద్ధమై

అటసెలయేటి గట్టుల శిలాగ్రమునన్ వసియించి, గీతముల్
కుటిలశిరోజముల్ బదసరోజములన్ బడి సంచలింప, న
స్ఫుటఫణితిన్ బఠించు నడ పుస్తకమున్గొని, యేకతమ్మయా

కుటిలుడు వెన్కనిల్చి, తనుఁ గోమలియందముఁ
జాలముగ్ధుడై.

తరుణిలలితశరీరవల్లరిచలింప,
నీలకేశముల్ చెదర, వెన్నెలలుగాయ
వదన మాశాక్యమునిఁగూర్చి ప్రజకుఁ బలుకు
వేళఁబరవశమ్మైన వాఁడు విని కలంగు.

భిక్షపాత్రతో పల్లియవీధులందు
బుద్ధదేవునెప్పుడు స్మరింపుచును తిరుగు
వేళలందున, వాఁడును వెదురుబుట్ట
లల్లునెపమునఁ జరియించు ననుసరించి.

భిక్షునులతోడ నిర్వాణ విషయములను
పలుకువేళల దేహమ్ము పులకరించు,
గండపాళి కెంపెక్కను గనులు వెలుఁగు,
వాఁడు దానిని గని పారవశ్యమందు.

చిన్నయనుఁగులతో శైలసీమలందు
సంచరించెడివేళ నాయంచయాన,

జాతి పడునేమొకోయని చాలభయము
నంది, తెప్పవాల్పక యామెనరయువాఁడు.

తన కమండలముధరించి తటినియందు
స్నానమొనరింపఁగా దిగి, దానమునిఁగి,
కొంతతడవున్నచో, వాని యంతరంగ
మెల్ల క్షోభించు, స్వేదమ్ము మెయిజనించు.

బుద్ధదేవునిఁ బూజింపఁ బూలుగోయ
వెన్నెలలలోన నాలేమ వెడలునపుడు,
ముందుదాఁనేగు, నేమైనఁ బురువులుండి
ఆయువతిని బాధించునేమో యటంచు.

వన్యమృగములు సైత నావనితపాద
పంకజములకు మ్రొక్కి సేవలనొనర్ప
ముక్కుపైన వ్రేలుంచి యామూఢుఁడచట
అరయ నీవింతననుచు నచ్చెరువునందు.

లలితచరణ నీరేజమ్ములను లతాంగి
కాననమ్మునఁ జరియించు కాలమందు,

కంటకములు గుచ్చుకొనునని, కదలిముందు
త్రోవలోనుండి ముండ్లను ద్రోసివైచు.

ఆమెకందని ప్రసవమ్ములతఁడు గోసి
తెచ్చియిచ్చునుఁ; జిఱునవ్వు మచ్చెకంటి
మోమునఁ మొల్కలెత్తఁగాబుచ్చికొనును,
కలిగె ధన్యత్వమనివాఁడు పులకరించు.

వానివృత్తి నెఱింగి, యాపంకజాక్షి
"పూజ్యుఁడా! నిన్నుఁ బాపంబుబొందదొక్కొ,
హింససేతురే?" యన, భక్తినెఱిగివాఁడు
దానినప్పటినుండియు మానినాఁడు.

ఆమెవానికి స్వీయభిక్షాన్నమొసఁగ,
అమృతమబ్బినట్లతఁడు మోదమువహించు,
ముదితతన్నుఁ బ్రేమించుచున్నదియటంచు
తలఁచి లోలోన మురియు నాతఁడుమిగుల.

"బుద్ధిమంతుఁడువీఁడు, శ్రీ బుద్ధదేవు
భక్తుఁడని" యామెచెలులతోఁ బల్కునపుడు
మెడనునిక్కించివిని, వాఁడుమిత్రుల హర్ష
కలితుఁడౌ నదిపేరిమిలక్షణమటంచు.

పూర్ణిమాచంద్రికలలోనఁ బుష్పవనము
చెంతశాద్వలమ్మున మేనుజేర్చియామె
బుద్ధదేవుని పాడఁగాఁ, బొంచివిని వి
యోగవేదనమనుచు వాఁడూహసేయు.

పవలనక, రాత్రియనక, యాపద్మనేత్రి
వీక్షణమ్ములకొఱకై తపించుచుండు,
ఆమెయెలుఁగువానికి నుత్సాహమిమ్మొసంగు
శాలకేకికి మేఘరావమువిధాన.

రమ్యమైన వసంతకాలమ్ము వచ్చె
తరువులుచిగిర్చె వల్లరీతతులుపూచె,
వనులఁగల కంకకలకంఠ నినదమొసఁగెఁ
బ్రకృతియంతయు హర్షదాయకమయయ్యె.

ఉదయగిరీంద్రశృంగముననున్న సువర్ణముదారమూర్తి, నా
ల్గుదెసలఁ బంచిపెట్టుచు వెలుంగులు జిమ్మి సరోజకన్యకా
హృదయగతాగ్రహమ్ములను వీడఁ బూరము
బారఁ జేయుచున్
గడిసెను ప్రాగ్దిశాహృదయకాముకుఁడా దిననాథుఁడర్మిలిన్.

పలుకఁగరాని వేదనలపాలయి, రేయి, యుగోపమక్రియన్
దలఁచి, మనోహరున్ గనుఁగొనంగల భాగ్యము లేదు,
జీవముల్
నిలువవటంచు నాసవిడి, రేయిజనన్ గనువిచ్చియచ్చటే
గలవరుఁ జూచి, చూచి మఱి, కౌఁగిటఁ దాచెను జక్రి
వాకియున్.

అళితతు లేచి యౌవనులనంతటఁ బూచిన పుష్పకన్యకా
వళి మధురాధరామృతముఁ బానము సేయఁ బరుండులెత్తె, వా
రలజగమందు లేదిది పరాంగన, యొక్కరె పెక్కువారలన్,
గలియఁ రాదు, నాదిదియన, న్నయమందఱివారలందరున్.

అలరులతాలయాగ్రముల, నయ్యవనీజమునీడలన్ సరో
నిలయములన్, మనోజ్ఞతటినీతటసీమల, శాద్వలమ్ములన్,

బులుఁగులు, పేర్మితమసీసహితముల్ విహరించెను,
మాధవుండు వా
రలకొావగూర్చు నమ్మధుఫలమ్ముల విందులఁ బొంగిపోవుచున్

తనసొాగసుందనమ్ము వసుధాస్థలిఁ జాటఁగ దక్షిణానిలుం
డును వెడలెన్ శరీరమున నూతనపుష్పవతీలతాంగనా
తనుగతగంధముల్ గొని, ముదమ్మునఁ జందనమద్ది, పద్మినీ
వనితల తేనెలాని, రసవంతపుఁ బ్రేమపదమ్ములల్లుచున్.

ప్రణయమె యున్నిచోటులను రాజ్యముసేయు
వసంతమాసమున్
గని, తలపోసివాఁడు నిజకామినిగా నొనరింపకున్న నా
వనితను, "నిల్వఁబోవఁడలఁ బ్రాణము లేయని"
యామె పాదభూ
మినిబడి వేడువాఁడను శమింపఁగఁ జేయుమటంచ దాపనుఁ

దినకరుఁడు గ్రుంకెఁ దలయె
త్తెను ?ఉన్నమచందమామ, తెల్లవయునట బు
ద్ధుని పూజసల్పి, మగుడ్జ్,
జనుచుండఁగ, వాఁడు వోయి సాగిలఁబడియెన్.

నిలువఁబడెను నివ్విరవోయి నిశ్చలముగ,
వాఁడుఁ దనయంతలేచి యవ్వనితఁజూచి
కాయమెల్ల నద్భుతగతిఁ గంపమొందఁ
బలికెనిట్టులఁ దడబడువాణితోడ.

నేనెఱుంగుదు నబల! కామానలమ్ము
కాల్చుటలు నిన్ను, నీచెలికత్తెలరయ
ననుఁ బలుకు వేళ మోముకాంతినివహించి
చెక్కులెఱ్ఱవారుటలు నీక్షించినాఁడ.

కాననభూమికంతటికిఁగాంత! ప్రభుండను; వీరలెల్లనా
యానతిమీరనోప, రిదయుందెదిగోరినఁ దేఁగలారు, నా
రాణివికమ్ము, నీవుగనరానిసుఖమ్ములులేవు, నీవునున్
నేను నికుంజపుంజతటినీస్థలులన్ విహరింత మెప్పుడున్.

నిద్దురమాని నీనయననీరజముల్ గనుకోర్కి నేను నో
ముద్దులగుమ్మ యెన్నొదినముల్ దెరువున్ గనిపెట్టియుంటి, నీ
నిద్దపుఁజెక్కుటద్దములు, నీలలితానన శీతరోచి, నా
కెద్దియొ చెప్పరానిముదమిచ్చు, విషాదము గూడనిచ్చెడిన్.

అరయుఁడ, నిన్ను, నొక్క త్రుటియైనను నిల్పఁగలేకపోతి, నన్
బరుఁగిడఁ జేయు మానసము, ప్రాణసఖీ! భవదీయదివ్యసుం
దరనయనమ్ములన్ గనముదమ్ము గలింగెడి, డింకఁ బాదముల్
వ ఆలవు నిన్ను వీడిచన, మారవికారము లింతలానొకో.

చిరుతపదమ్ములన్ విపినసీమల నీవుజరించు వేళ దు
ర్భరముగ ముళ్లు నీలలితపాదము గుచ్చునొయంచు నామన
మ్మెడియు, సరస్సులో మునిగి యించుక నిల్తువయేని
క్షోభమున్
బోరయుదుఁ, గొండజాలపయిఁబోనెద కొట్టుకలాడు నెచ్చెలీ

పరిచయమ్మైన వేరైన, ప్రాణకాంత,!
క్రూరకానసమృగములు చేరి నిన్ను
దరియు వేళల నాయెడ కరఁగిపోవు
యెప్రుడయిన నిన్ను బాధించునేమొయనుచు.

వెన్నెలరాత్రిలన్ మధుపవేణి సుమపత్రశరమ్ముఁబూని, దీ
వ్యన్నయనాబ్జముల్ వెలుఁగ నద్భుతరీతిని, బుద్ధకోవెలన్
దిన్నగ హంసయానమున నీవటులొంటిగఁ జేరువేళనే
నన్నిను వెంబడింతును మనోహరి, దుర్జనలీలమాన్పఁగన్

తరుణీ,! వేలుపుటందకత్తియవై సౌందర్యమ్మునిన్నునన్ బో
లదు లోకోత్తర సుందరాంగివి, పరిభాలంబమ్ములీకన్ను, లిం
దిరవాసమ్మొనరించు నిత్యమిట, నేదేవింతసంభాషణల్
నెఱపున్ సన్నని, యున్నతమ్ములగు సందేశమ్ములన్ నాకిడన్.

చిఱుత ప్రాయమ్మునాడె నీవిటులనిస్సీ! సన్యసింతే? యిటుల్
మఱుగై నిర్జనముల్ మఠమ్ములవసింపన్ బూనుదే? దేవి, యి
త్తఱి నీయందము కాననాంతర సుధాధామ ప్రభాపించియే;
మఱి, యారణ్యకపుష్పసద్వికసనమ్మా!, చెప్పుమా! సుందరీ.

అలలితాంఘ్రియుగ్మమున కందియలెంతటియందమిచ్చు. దే
వాలయసీమలన్ విపినమందు జరించెడివేళవింతగీ
తాలు పఠింతవే? వినినధన్యులునొందరెపారవశ్యమున్
బాల! తలంపవేమి యెలఁబ్రాయము చెల్లుట? లక్ష్మినిల్చునే?

లలితలతానికుంజముల రమ్యనదీసికతాస్థలమ్ములన్
తలిరులతోటలన్ సరసతామరసాలయసీమలందు నీ
వలచినవానిఁ గౌఁగిటనపారసుఖమ్ములఁ దేల్పఁబోక యో
చెలి, యిటనేసుఖమ్మనుచుఁ జేతునిరర్థకపూజలిమ్మెయిన్.

ముడుతలుబడ్డనాఁడుమోము, ముంగలనున్నవె కానరామిచేఁ
దడఁబడునాఁడు, పల్కుఁగఁబదమ్ములు సందులనుండి
యెంతయున్
విడిబడిపోవునాఁడెదియు వీనులదూరనినాఁడు సుందరీ!
కనువగఁజెందె దీవిటులఁగాల్చెద వేటికిసౌఖ్యమిప్పుడే?.

పరిమళరాజికిండ్లు ప్రసవమ్ములనీవుధరింపవేమి? సుం
దరచికురమ్ములిట్టులువిడా,! జడగట్టసహింతువెట్టు ల
వ్విరివిలుకానిగద్దెయిది విస్తృతవక్షము ప్రేమతోనలం
కరణముసేయవేమి? యలుకా సుమదామము
కూఁడగూడదో?

ఐననొక మేలుగలదునాకతివ! నీవు
సన్యసించుట,- నీపరిచయమునాకు
దీవనేకాదెకల్గె? నా దేవునకును
ధన్యవాదములర్పింపఁ దగవు కాదొ?

ప్రసవము ల్లి నీచికురబంధమునన్ముడివేతు, నీకునై
వసమయియుండి నీపదముపన్నులు సేసెద, నీయకాలస

వ్యసనమ దేల? రమ్మా! బిగియారఁ గవుంగిటఁ జేరి ప్రియపున్
బస, సఫలమ్ముఁ జెంద రసవంతము జేతము జీవితమ్ములన్.

అనివచించి హస్తమ్ము లనతఁడు చాచి
నిలువఁబడె నామె యెదుట, వెన్నెలలు గాయు
మోముపై దృష్టి నిల్పి,- యాముగుద పలికె
పరమశాంతభావ మ్మచ్చుపడఁగ నిటుల,

ఏవముపుట్టఁ జేయు తను వేలఁ గనుంగొని యావికారమున్
భావనఁ జేతు వీవొకదినమ్ము పవాసము సేయలేవె? రో
గావిలవృత్తి నొక్కదినమైనఁ దపింపవో? ముల్లుగుచ్చుకో
దే? వినవే మొయాప్రియము! దేహము సత్వ మెఱుఁగఁ జాలవే?

వాడినవాడకున్న నిది వాఁడు నటంచు నెఱింగి కూడ నీ
వాడుకొనంగ నెంతు ప్రసవమ్ముఁ గనుంగొని మోహవృత్తితో
వాడని పూవుకై వెదుకు భారముఁ బూనుట నీవొకింతయుఁ
జూడవ దేమి? యీమహాపుచోద్యముపో! పసిపాపవాయిఁ న్?

బావిలోఁబడి తనముందుపడిన బాయి
పయినఁ గాల్మోపె దేల రవంతతృప్తి

కోటలు? మాధ్యము కాదె యిర్వ్యను బడకె
సలుపవలదొకో యూన్య రక్షణముకోరకు?.

ఒక్క రెండేండ్లు పై బడ నుడిగిపోవు
యౌవనమ్మంత వార్ధక్య మవతరించు
హేయతరరూపమ్ముకో నిది యెఱిఁగికూడ
వలచెదవదేల దీనినే తెలివిమాలి.

విమల నిర్వాణపదము సేవింపుమనుచు
చూడు బుద్ధదేవుఁడు పల్కుచున్నవాఁడు
వాంఛలన్ విడి విడిచి ప్రపంచమెల్ల
కొలువుమోయీ సుఖమ్ము నఁగూడునీకు.

అవనిపై దృష్టినిల్పి రవంతయాగి
మఱల నాలతాంగినేత్ర సరసిజముఁ
జూచి ముగ్ధుఁడై కలఁగి యాసుందరాంగి
తోడ నీవిధివచియించినాఁడువాఁడు.

నీవు వచియించునన్నియును నిక్కమె కాని శమింపదేలొయీ
భావవికారముంగ ! భవన్ముఖచంద్రునిఁ జూచినంతనే

యీవచనమ్ములెల్ల క్షణమేనియునిల్వవుముందు బాణముల్
భావజుఁడంగకమ్ముల బలమ్ముననాటును దప్పఁడింతయున్.

కలుగకపోదు మానవుల కందఱకున్ మృతి నేఁడొ ఱేపొ, ఓ
జలజదళాయతాక్షి! యిదిసత్యమె, కాదనగాని, యీవలన్
గలిగెడునట్టిదేమొ యెఱుఁగన్, గలవారలు లేరు; దీనికై
సలుపుఁ బ్రయత్నమంతయు నిజమ్ముగ వ్యర్థమటంచు
[నెంచెదన్.

బ్రతుకొక మూడునాళ్ళ మురిపెమ్ము; జనమ్ములు సర్వ
[మావలన్
చితిపయినెక్కఁ గాలి, యొకచేరెడు బూడిదరౌదురంతె; యే
మతిగలవాఁడుకూడ కరమందలి వెన్నను మాని నేతికై
వెతుకఁదలంపు వెట్టఁ డరవిందదళాక్షి యొకింతఁజూడుమా!

ప్రణయమే ముక్తి- స్వేచ్ఛయే స్వర్గభూమి-
దేవుఁడీ మాధవుఁడె- యన్య దేవతలను
గొలుచుచున్ గాలమును వృథాసలుపనేల?
రమ్ము భోగింపనిక వేగిరమ్ము బాల!

సకియా! నాలోకమందు విషాదమునకుఁ
దావులే, దెలియంగక క్రుంగెదవ్రలతాంగి!
బ్రతుకు నీమూఁడునాళ్ళ సంబరముపడక
యేల, యెలజవ్వనమ్ము వ్యయింతువకట!.

కడచిపోయిన పొఱల నొక్కటియు గాదు
నీవు చింతించునట్టి యీనిముసమెల్ల
వ్యర్థమంచును మఱువఁగావలదు ముగ్ధ!
బాలికవు తలపోయుమీ పలుకులెల్ల.

అవనిపై దృష్టిచాలించి, యతివవాని
మొగమునున్ జూచి, చిఱునవ్వు మొలకలెత్త
పలికె "నానునీకయి యీప్రపంచమెల్ల
పుట్టువందెను- భోగింపుమోయి యనుచు!".

అలుఁగకే నీవుపీనివిను 'మందఱు సుందరులొక్కనిన్నెపో వలతురె? నీవొకండవె ప్రపంచమునన్ బురుషుండవే? జగమ్ముల నినుమించు సుందరులుబుట్టరె? నీవువరించునెల్లకాంతలు నవమన్మధుండనుచుఁ దప్పకనిన్నె వరించుచుందురే?.

తాను మన్మథుఁడనటంచుఁ దలఁచుచుండుఁ
బ్రతిమనుష్యుఁడు; నవ్వుచుఁ బాడుకొనుచు
నేర్పుచున్ భుజించుచు నెప్పుఁడేని సుంత
తన్నుఁ దానద్దమునఁ జూచుకొన్నవాఁడె?.

వలచితి నన్నునీవిపుడు; భావము నీకయి వాడఁబోదు; నీ
సలిపెడిదేమి? కల్గదెవిషాదము? గోరికఁ జంపివైతువే?
బలమునుజూపవో? జయమువాటిలునే నితరమ్మునీకె? ని
ష్ఫలమయినన్ దపింపవె? విషాదము లేదనిపల్క జాలుదే?

బలముఁజూపితివనుకొమ్ము - ప్రాణములను
విడిచితనుకొమ్ము - గెలిచితివే? విషాద
మొదవదే? - యీప్రలాపమ్ములోయి, యేల?
కోరికలు దుఃఖమును రెండుగూడియుండు.

పలుదెసలందుఁ గ్రమ్మకొని నాల్కలుజాచుచు భీకరాగ్నికీ
లలు నిను డగ్గరింపఁగఁ గరమ్మున వెన్న భుజింతునంచుఁ గ
న్నుల నరమూసిపల్కెదు-సినన్ నయశాలియటందు
[రయ్య, మా
ర్షులు జనతోఁ బ్రవఁబోవుచు నకంపితతేజుఁడ నందువక్కటా!.

కనులమూసి పాల్ద్రావుచు మనుజులెవరు
దన్నుఁ జూచుటలేదని తలఁచుఁబిల్లి
వగలలోనుండియును, నీవు వలికెదకట
లేదు నాలోకమందు విషాదమనుచు.

స్వేచ్ఛయంటివి - కోర్కెల సేవకుఁడవు
సౌఖ్యమున్ గొలుచుచును, విషాదమనిన
భయముతో మార్గమువెట్టి పరువులెత్తు
నీవు స్వేచ్ఛయున్నదె మనీషివర్య!.

పరమసుఖమ్ము, స్వర్గమనిపల్కెడ, రీతుఁ సౌఖ్యమట్టిచో
విరివిగ దానినే యనుభవింపర దేలకో! అసవమ్ముఁ ద్రా
వరె క్షణమైననాగకయె ప్రాణములుండినదాక యేల, యీ
విరస వచోవిధానములు వెంగలిబుద్ధులు వెట్టిపోకడల్.

వలచినవారిఁ జేరి, తమవాంఛలు దీరఁగఁ జిత్రసౌధ భూ
ములవనసీమలన్ సరసిప్రాంతననేకవిలాసలీలలన్
లలితమధుప్రచారములొనర్ప యొందబో సార్వభౌము లీ
యిలనిపుడున్నవారో? వగనించుకయేనియుఁ

[బొందబోరాకో?

పలికెను మూడునాళ్ళముచ్చటవమ్మని జీవితమెల్ల, దీనిలో
పలుకఁగల దేముడన్నొ? గనుపట్టదె తీవ్రవిషాద వేదనా
నలము?- కటా! కనుల మొగిచినన్ వగదప్పునటయ్యొ!
[నీచపుం
దలఁపుల కేలలోఁ బడెదు ధైర్యము లేదొకో? యింత జాలవే? ”

అని వచించి యాలలితాంగి యాగె- వాఁడు
నొకనిముసమట్టులే యూరకుండి పిదప,
మోముపై కెత్తి కమలముల్ బోలునామె
నయనములుగాంచి, కొంత యాననమువంచి.

“చెలి! విని నాఁడ నీవిటు వచించినపల్కులనన్ని, కాని యా
చరణమునందుఁ బెట్టగలశక్తి రవంతయు నీక్షణమ్మునన్
గలుగదు- పిమ్మటన్ దెలియఁగాదగు; నేటికి యీ
[విశుష్క భా
షలు? మధుమాసమిద్ది, పెలుచన్ నవయౌవ్వన
[మంతరించెడిన్.

కలుదుగదే మనోహరి! సుకమ్ముగ నియ్యవిచర్చ సేయఁగా
వలసినయంత కాలము? త్రిపామతి నిప్పటినుండి యేవృథా

కలతవహింపనేల? మనకై యౌఁజవ్వనమున్ వసంతమున్
జెలి! మఱివచ్చునే? తెలియనేరవు కాలమమూల్య
[మియ్యడన్.

యువతి! చాలును నేనూరకుండలేను
ఈదినమ్మునవనిన్నుఁ బోనీయ నేను
ధవళ సరసిజపత్త్రి సుందరములైన
నీనయనములు నన్ముగ్ధునిగనొనర్చె.

ప్రేయసీ! భవన్నయనముల్ రెండు రెండు
నిండుజాబిల్లు లమృతమ్మునిండియుండు
నవ్వి నామీఁదఁబడియెనా, యమరుఁడనయి
అవిరళానందభాగ్యమ్ము లందఁగలను.

కలువపూవులజంట నీకనులజంట
వానిలోఁదీసిపోవని తేనెకలదు
అది యనుభవించువాఁడు, రాజాధిరాజు
లందఁగాలేని భోగమ్ము లందఁగలఁడు."

అనుచు నావేశపూరితుఁడై యతండు
గదిసె, నాకాంత;-"సోదరా! యిదిగో నీకు

కోరినదటందు" నామె చక్షువులాగి
వానిపై వైచెఁ "బుశ్శ్యకో" దాఁ నంచు.

"మధువు కారుచునున్నది మర్త్యుడా! ర
యమ్మునన్ దెమ్ము నీవుఘటమ్ము, రక్త
వర్ణమై, త్రావి ప్రియమారఁ బడయుమమృ!
సార్వభౌములకైనఁ దోచనిపదమ్ము.

ఈయమృతమెల్ల నిప్పుడేయిగిరిపోవుఁ
గాన రమ్ము, శీఘ్రమ్ముగదీనిఁ ద్రావి
అమరవర్యుఁడవై భూమియందె నీవు
అవిరళానంద భోగమ్ములందఁగలవు."

అనివచియించి యామె విశ్రుతాననముంచుఁ బ్రశాంత
[భావమే
కనఁబడ నిల్చియుండె· నదిగాంచి యెడంద విచిత్రవిభ్రమ
మ్మనువడంగ మాన్పడి, భయమ్మును భక్తియుఁగల్గ
[వాఁడు ని
ల్చెను, బలుకాడరాక మతిచేష్టలుదక్కి యు
[విగ్రహమ్మటుల్.

నయనగుహాంతరమ్ములఁ గనంబడెఁ గ్రొమ్మహాప్రవాహముల్
రయమున నొక్కపార్శ్వమఖిలమ్ము క్రమమ్మున నాక్ర
మించి చిఁ
ది, యవనిపాతై; దానిపయిఁ దేజరిలెన్ గళితాక్షి పాటల
మ్మయి యొకపద్మమట్లు- భయమందెను వాఁడది
[చూడ సేనియన్.

చిఱునగవు సగముదోఁపఁగా దరుణిపలికె
"ఓయి, నీవిపు డెటులూఁగకుండఁగలవో?
మొదటి కలువపూవునఁగల మధువునంత
త్రావితి వె? రెండవది యిత్తునా! వచింపు!.

ఇదిగో, సౌందర్యరాశి కాదే, యదేల
భయము నందెదు చూడఁగా-? బలికితీవు
లేదు నాలోకమందు విషాదమనుచు
అయ్యో! కన్నీరుగార్చెద వట్టులేల?

అనివచియించు రామఁగని, యాతఁడు తీవ్రవిషాదవేదనన్
గనులజలమ్ము కాలువలుగట్టఁ బ్రదక్షిణమాచరించి యా

వనితకు మూఁడుమారులు కృపామతినన్ క్షమియింపవమ్మ
యోచవని,! కిరాతుడన్ దోసఁగు సల్పితినంచని యాంఘ్రి
[లగ్నబడన్.

"దురహంకారుని, నన్ను, నజ్ఞుని, మహాదుష్టాత్ముఁ,
[బాలింపఁగా
ధరపైఁ బుట్టిన దేవివో, కనులమాంద్యమ్మెల్లఁ బోఁగొట్టినా
కెఱుఁగన్ జెప్పితి దివ్యసత్యమును దల్లీ! మర్త్య దౌర్బల్యమున్,
గురుభావమ్మున నిన్నుఁ గొల్చెదను జేకొమ్మావర్ణితా
[మమ్ములన్.

మనుజుఁడు పెక్కు కోరికలమధ్య నిజమ్మగు స్వేచ్ఛఁ గోలుపో
యి, నిరతమున్ వగన్ బడి కృశించును దాను ఘనుండనంచు
నెంచును, విజయమ్ము గల్గునెడ - శోకము గల్గిన నిద్దరై వక
ల్పనయాని వాదనల్ సల్పువాని లఘుత్వమెఱుంగఁ డింతయున్

జనని! మూర్ఖుఁడ- నాకిల్బిషమునఁ జేసి
నేత్రభంగమ్ము నీకు జనించెనకట!
పాపము క్షమించి నన్ను కాపాడుమమ్మ!
శిష్యునిగఁ జేసినన్ దరిజేర్పుమమ్మ!.

తెలియక కిల్బిషమ్మని వధించినదీ కరమక్కటా ! జన
మ్ములఁబలుమారు లీపథముపొంతఁ జరించెడు వారి, [వారికాం
తలు చెలులున్ దనూజులును దారుణశోకమునండ్రొక్కటా!
నన్ దలఁచి శపించుచున్ దెలియదాయెను బాపముఁజేయు
చుండుటల్.

కడు దహియించుచున్నవి ప్రకంపిత గాత్రుని. నన్నుఁదొల్లి [మూ
ర్ఖుఁడనయి నేను నవ్వుచు నెఱుంగక చేసినపాప కీలలే
వడువున బాప భారములఁ బాపినన్ దటేఁజేర్తొతల్లి! నీ
యడుగులఁ గొల్చెదన్ గడుదయన్ నను శిష్యునను
గ్రహింపుమా!"

ఆమె వానిని తెమ్మని యాలతినవ్వ
వికృత మూర్తికి మఱియెంత వికృతిఁ గూర్ప
'ఊరకే నశియింపక యొకని నుద్ధ
రించె, దీని జీవితము ఫలించెఁగాదె?

ఆవనిని వస్తుజాలమున కంతకు మార్పు ప్రధాన ధర్మమౌ
నెవఁడును దీనిఁ దప్పఁడు; గతించు క్షణమ్మున నున్న నేను, ని

ష్ఠవెలయు నేనుగాదు; కడు మోహముతో, నవివేకమూని మా
నవులు సతమ్ము శాశ్వత ధనమ్ముల కాసవహింతురక్కటా

జీవుఁడు తొల్లిపుట్టువులఁ జేసినవాని ఫలమ్ముఁబొందు నీ
భావమునొంది, యెవ్వరును వారలు చేయనిదానిఁ బొందబో
రీ వానశించు పాపమది యెట్టిది నాయెడనింక? బీజమే
నే వెనుకన్ జనించినపుడే భువి నాటితి సుమ్మదీనికిన్

వినుము ముముక్షువెన్నఁడును వేనినిఁ గోరఁడుఁ; కోర్కెలే జగ
మ్మునఁగల శోకమంతకును మూలము- నిక్కము,
[మాని యెవ్వఁడా
శను ద్యజియించువాఁడె- యతఁడె సన్యసనమ్ము, తరమ్ము
[లోకవం
చనమిది నీ వెఱింగి మద సల్పుము సన్యసనమ్ము ధీరతన్.

ధరణి నహింసయే పరమధర్మము,- తానెటుగోరునట్లె యు
ర్వ్వరఁగల జీవులున్ బ్రతుక వాంఛయొనర్తురు- హింసపెట్టు
నేనరుఁడోరుఁ దన్నుఁదానె హారణమ్మొనరించినవాఁడు
[వాఁడె; యె
వ్వారెది యొసర్చినన్ ఫలము వానిని జెందకపోవదారకే.

మనుజుఁడు తానకర్త, తనమారణమున్ దనధారణమ్ముఁ జే
యను- దనకర్మలేమఱల నాతనిఁబొందును- బుద్ధిమంతుఁడో
క్క నిముసమైనఁ బాపమతికాఁడు-వరింపమహింస హింసనీ
మనమున, వాక్ఛరీరముల మానుము! మోక్షమునిన్ను
[బొందెడిన్.

అభ్యసింపుము ధర్మ మర్గాష్టకమ్ము
నిజముపలుకుము, ధర్మమ్ము నిలుపుమవని
ప్రాణికోటిఁ బీడకఁ బాపమ్ము పొంతఁబోక
మనుము ధీరుఁడవై జగమ్మునఁ గుమార!.

ఇంద్రియమ్ములె జగము సృజించెఁగాని
అరయ నిదియంతయును శూన్యమందుఁ గొంద
ఱిది తలంపు లోపలనెయున్నది, బహిఃప్ర
పంచమే లేదటంచుఁ దత్త్వపరులిందు

వివిధ భేదమ్ములింద్రియ వీధులందు
వెలసెఁగాని- నిజమ్ముగాఁగలుఁగదుక్క,
వినినది, స్పృశించినది,రుచించినది, చూచి
నదియు, వాసించినదియు, సత్యముగ లేవు.

ఇదిమెఱుంగక మోహాంధు లీమనుష్యు
లింద్రియమ్ముల వలలవఁబడి, కోరి,
చూచి, విని, రుచి, వాసనచూచి, తాకి
కొట్టుకొందురు- ముసుగులో గుద్దులాట.

వీని కేమిటిగాని- సేవింపుమిపుడు
ధన్యశాక్య, శుద్ధోదన తనయు, బుద్ధ
దేవు, నని" యామె వానినా దెసకుఁ గొంటఁ
దీసికొనిపోయెఁ బులకింప దేహమెల్ల.

వదనమున శాంతభావమ్ము వన్నెవెట్ట
అభయహస్తము పైకెత్తి యుండరు, వాని
బుద్ధదేవుని మ్రోల నాపుడమిమీఁద
వారు సాగిలంబడి మ్రొక్కినారు భక్తి.

నీకు నమస్కృతుల్ ! లలితనిర్మలశాంత మధుప్రపూరముల్
నీకమనీయమౌముఖ వనేజమునందున నిండియుండు, ఘో
రాకులచిత్తులై కడుదురాశ పిపాస దహించుమానవా
నీకము తృప్తిఁజెందునిటనే, మధువింకదుపో, యుగాలకున్.

రాజకులమ్మునందున ధరావలయ మ్మఖిలమ్ము నేలు వి
భ్రాజిత శక్తితోడఁ బ్రభవమ్మయి సర్వకళాన్వితుండవై
తేజము వెంచి, లోకమునఁ దీనులఁ గాచు తలంపుతో, పరి
వ్రాజక శేఖరుండవయి భాసిలు నీకు, నమస్కృతుల్ గురూ!.

నీవిమలాంతరంగమున నిన్నుగుఱించి తలఁపులేనివియున్
లేవుగదా! యతిప్రవర! నీయెద, యేనిరుపేదజీవికై
నా, వగవచ్చినన్ నిలువునన్ ద్రవియించి స్రవంతులౌను దీ
నావన బద్ధకంకణ! కృపాంబుధి! నీకు నమస్కృతుల్ గురూ!

అరకాలన్ ములునాటియుండుట నరణ్యమ్మందు వోలేక వే
సరియున్ జక్కని గొఱ్ఱెపిల్లను నిజస్కంధమ్మునం
[దుంచియున్
పురికేతెంచితి, నీవచోమృతములన్ బూతాత్ములై పౌరులె
ల్లరు పూజింపఁగ నెంత పేరిమి! నతుల్ గావింతు నీకో గురూ!.

నలుఁగడ నొక్కటే రణగుణధ్వనితోడఁ బురోహితుల్ గళ
మ్ములు సవరించి బిగ్గఱగ మోములు ద్రిప్పుచు యజ్ఞ
మంత్రముల్

బలి కెదు వేళఁ గట్టువడి బాష్పము రాల్చెడు మేకపిల్లయే
డ్పులువిని న్యాహాకండవె, ప్రభూ! యివెనీకు నమస్కృతుల్
[గురూ!

బీదలఁగావగా విపిన వీథులఁ గంటక సీమలందు నీ
పాదములుంచుచున్ ధరణిపాలతనూజ! చరించినాఁడవె
న్నోదినముల్, భుజింపక మహోగ్రతపమ్మునొనర్చినావు
శుద్ధోదనపుత్ర, త్యాగివనుదున్ నిను, నీకునమస్కృతుల్
[గురూ!

సుందరులెందరో కలిసి చుట్టునునాట్యములాడ, హర్మ్యముల్
నందనసుందరమ్ములు వనమ్ములు నందమొసంగ, నాజ్ఞలీ
యొందడవంతె, వానిని రయమ్మునఁదీర్ప, ముదమ్ముఁజెందు
వారుండురుకాని, యీడు నరులుందురె? నీకునమస్కృతుల్
[గురూ!

శరము మనోజ్ఞచంద్రికలు గాయుముఖాబ్జుఁడుడు, మూన
[వాళిఁ నిన్
దరిసియు నీముఖోద్గత సుధారసధారల నానినారుగా,

భారతధరిత్రి నీచరణ వారిజరేణుకణాళి మోసి యె
ల్లరకును వంద్యయయ్యెఁగద! రాసుత! నీకు
[నమస్కృతుల్ గురూ.

పలకలుబూనమేన, వనభూమిని మీర లుపన్యసింప, లో
కులు పెను మ్రొక్కులై విన. నకుంఠితతేజుఁడు బింబిసారుఁడా
స్థలమున కేఁగుదెంచి భువి సాగిలఁగాఁబడఁబోలు, పూల సో
నలు,పయి భూజముల్ గురిసెనా! యివె నీకు నమస్కృతుల్
[గురూ!.

వారు మ్రొక్కి లేచిరి, శిష్యవర్యుఁడయ్యె
వాఁడు భిక్షునికిన్, ధర్మపరతకల్గె;
ఆమెయెడఁ బౌరులకుఁ బ్రేమ యతిశయించె
ఆమెకీర్తి నల్దెసలకుఁ బ్రాకె.



# ప్రేమబలి.

## అర్పణము.

ఈలతాకిశోరి వినాపూవుఁదోటలోఁ
బ్రియము వెంచి నాటి పెరిగిపూచు
నట్టి సుమము నైన నరయకే, దాని దు
ఖింపఁజేసి పోవుదంపతులకు.

## —♦ ప్రేమబలి. ♦—

[ఆసియాఖండములోఁ బశ్చిమమున, 'ఆసియామైనరు'
లో, సముద్రప్రాంతమున నున్నపట్టణము 'ట్రాయి' "ప్రియాము"
దానియధిపతి. 'పారిస్' వానిసుతుఁడు అతఁడు 'ట్రాయి'
నాశనమునకు కారకుఁడని జ్యోతిష్కులవలన వినిన తండ్రిచేఁ
బరిత్యక్తుఁడు. గొల్లవారిచేఁ బెంచబడినాఁడు. అద్వితీయ సౌం
దర్యమూర్తియయినాఁడు. నవయౌవనంపు దినములలో నత
నికిఁ బ్రియురాలు 'ఇనోని', ఆ మెనదీకన్య.

అతఁడు తనసౌందర్యముచేఁ దండ్రిచేఁ బునరంగీకృతుఁ
డైనాఁడు. 'గ్రీకు', నకుఁ బ్రయాణముసలిపి తదధిపతికిఁ బ్రియ
భార్య, త్రిలోకసౌందర్యవతి, 'హెలినా' కాంతను, దీసికొని
వచ్చినాఁడు. 'ఇనోని' దెసమఱలఁ జూడలేదు,

అప్పుడు 'హెలినా' నాథుని పక్షీయులగు 'గ్రీకు'లకును
ట్రోజనులకును భయంకరయుద్ధము జరిగినది. అందువారల
ననేకసైనికులు జీవము లర్పించినారు. పారిస్ ప్రాణహరమగు
గాయముతగిలి మాన్పించుకొనుట కౌషధ విద్యాకుశలినియగు
'ఇనోని', కడకువచ్చినాఁడు పారిస్- అతనిసేవకులతని మోసి
కొని వచ్చినారు.]

## ◆ ఇనోని ◆

ఇన్ని నాళ్ళకు సెలవుగా నిపుడు మఱల
నీకు జ్ఞప్తికి వచ్చెనే? నిన్న మున్న
అంకమున నిద్రపుచ్చి ఘర్మాతిరేక
మడఁపఁ దనపైఁటతో వీచునా యినోని?

ఏ నుఁ వచ్చినాఁడవుర యిచ్చటికిప్పుడు నీవునాథ! నన్
జేరి నా మొయిన్ గనుంగొనెడు లేమ యొకర్తుక యున్నదిచ్చటన్
నే నిను గూర్చు నాకనుచుఁ జిత్తమునన్ దలపోసితా? యినో
ని! మఱిభాగ్యశాలివి, గణించుమునిన్ విభునిప్పుడేసయున్.,

సుకముగఁ గాలమున్ గడపుచోట, నినోని; యొకింత కేని జ్ఞ
ప్తికిఁ దపులంగ బోదు మఱి వేదనగల్గిన వేళనైన నీ
సకియ తలంపు వచ్చెఁగద; చాలును నాకది నా విభుండు నిం
చుకయిన నన్ను నాదరపుఁజూపునఁజూచెను భాగ్యమే కదా!

ఈ సౌందర్యము — వేల్పుకన్నియ తలకాని - చూడగారాని యీ
నీ సౌందర్యము నాకు దక్కె ననుచున్ నేనెన్నఁగారాని సం
తోసమ్మందితి - గర్వమందితిని - యీ దుఃఖమ్ము చేకూడునా
యాసల్ ద్రుంగునటంచు నేను కలయందైనన్ దలంపన్ గదా

కావ్యమాల.

మును 'సఖి'కిన్ మనోజుఁడె విభుండయి సౌఖ్యమొసంగెఁ- [గానియా
ననిశయు నెన్నొ పాట్లుపడె వానికిఁ దమ్ముఁడ; నట్లుకాక యా
మనసిజు మించు సుందరుఁడు మామకవల్లభుఁడా మెనంచు నిం
తిని యనరాని సంతసము నందితిఁ దప్పకపోయెఁగా వెతల్.

ఈపొదరింటిలోనే "నాథ! మఱచితే?-
రావా?" యనుచు లేఖ వ్రాసినాను,
ఈగిరివిూదనే యింతులు నవ్వఁగా
నీకొఱకై వేచి నిలిచినాను,
ఈతరంగిణి చెంతనే వత్తువీవని
కుసుమమాలికలెన్నొ గ్రుచ్చినాను,
ఈపాదపము చెంతనే నీకుఁదినిపింపఁ
బరిణతఫలములఁ బట్టినాను.

ఈసరస్సు చెంగటనె నాయెదుటఁ బుట్టి
సూటిలేచి తలమీఁద సురిగివ్రాలు
చుండఁగాఁ జుక్కలన్నియుఁ జూచియేడ్చి
నాను, కండ్లుకదుముకొట్టఁగాను, నాథ!

ఈకనులఁబుట్టి, అశ్రుల వెన్నొజాతి
కలసిపోయినవిచ్చటఁ గాలనియందు
దీనికిని గ్రీష్మనునుమాట లేనలేదు
ఎన్ని రాత్రు లిట్లుంటినో యేనెఱుఁగ.

అనురక్తిన్ మనమానసరోవరము చాయన్ నిల్చి ప్రేమమ్ముచిం
దిన యాముచ్చటలెన్నొ చెప్పఁగొనియెంతే సౌఖ్యవారాశిలో
మన దేహమ్ముల నేయిఁకన్ మఱచిపో, [illegible]ందా[illegible]న్ శీతలాం
బునికాయమ్ములఁబంపి యీనళిని సొంపున్ సౌఖ మున్
[గూర్పదో?

ఎవరు తీర్పఁ[illegible]లె దాని, యీఋణము
వడ్డితోడుత నివ్వఁగావలదె? యిచ్చి
నాను నిట్టూరుపులతోడ నయనజ[illegible]ము,
అప్పుతీరదో? యిప్పటికైనఁగాని!

ఎటఁబ్రాయమిటు మొల్కలెత్తఁగా నీతోడ
నీక్రిందనే నేను నిలచితినుచు
నూతనరాగమ్ము పాతుకో, నీతోడ
నినుఁగోసి శిరములనిలిపితనుచుఁ

కావ్యహాల.

క్రొత్తకోర్కులు సంపదుల్ చూడ నీతోడ
నేను నీలోఁగ్రుంకినానటంచుఁ
ప్రణయమ్ము విరిసిన పట్టున, నీతోడ
నీయెడ వివశనై పోయితనుచుఁ

గుజలతానదీ, నికుంజమ్ములను పేరు,
వేఱఁ,బిల్చి, వారివారి ఋణము
ఇచ్చివేసినాన?—యీయశ్రుజలముతో—
నాకునివియె కలధనమ్ములగుట.

పూర్వపున్ గాథలివి త్రివ్వి పోయెనేల?-
ఇచటికరుదెంచినార, లోకించుకంత
జ్ఞాపకమ్ముంచి, నాదు భాగ్యముఫలించి-
అంతెచాలు నాకింక, నన్యమ్మదేల?.

—♦ పారిసు ♦—

చెలువ! మనమెుక్కింతయును జిక్కదు నాకు శరీరమింద్రియ
మ్ములు నివినావికావు,తలపోయఁగ సంత్యముదవ్వులేదో! నే
బలుకఁగ నోరురాదిదిగో; పాన్థముఁగంబున నమ్మునాటిసన్
సిలుగులఁబెట్టుచున్నయది,సిద్ధముచచ్చుట!- చూడవచ్చితిన్

మునుపొక కొన్నినాళ్ళు మఱపున్ గరాని సుఖమ్ముఁబొందమే-
పరిణయము పెంపొనర్చి, చెలువా! విహితుండనునీకు నేను, గా
వునఁ గృపయుంచి యీసిలుగుఁ బోవఁగఁజేసియు సౌఖ్య
[వారిధిన్
ము నిగెఁడు నట్లొనర్పఁగదె! మొక్కెదనీకు సరోజలోచనా!

—♦ ఇనోని ♦—

ఎంతటివాని కెంతగతి యేర్పడె!- రాజకులమ్మునందునా
కంతునిమించు రూపమునఁ గల్గినవానికి, శౌర్యమందు నా
వంతయుఁ దీసిపోని బలవంతున, కిక్కటలన్న వేమిటో
సుంతయెఱుంగనట్టి సుఖశోభితమూర్తికినీకు నక్కటా!

ఏటికి వచ్చిపడ్డ వెతలిట్టివి-? రాజసుతుండవీవు, ని
న్నొట్టున నన్యరాసుతుల భామినులన్ దలఁపంగ మేలె? ఆ
బోటి నొకర్తుకన్, మగఁడు బోవుటచూచి హరించి
తెత్తురే?
సాటి జనమ్మునవ్వనని సందియమైనను గూడదే? విభూ!

నను వద్దన్నను మాన్పఁ గావలెనన్ నాకంబు మేలైన జ
వ్వను లెవ్వారలు నిన్నుఁ గోరరకటా! పాదోధినిన్
దాటియున్
బని పడ్డట్టులు పోయియా చెలిని, దత్ప్రాణేశుఁ డచ్చోట లే
కునికిన్ జూచియు నిట్టు లెత్తుకొని రాఁగూరిరమ్మ గాదే?
విభూ!

ఎంత పవిత్ర స్థితి కెక్కినది యీనగరమ్ము!-పరాక్రమమ్మునం
బెంతటి ఖ్యాతిఁ గాంచిరిఁక నిచ్చటి వీరులు—? పాటిరాజులం
దెంత మహాత్ముఁ డన్న నుతికెక్కెను నీ జనకుండు? వీరలి
ట్లింత శ్రమమ్ముఁ గాంచుటకు హేతువదెట్టి వచింపరా? విభూ!

పాపము! నీవు మాత్రమిటు పాటిలునంచుఁ దలంచి నాడవే?-
ఈపృథివీస్థలిన్ గల మృగేక్షణలదంటె కన్నమిన్నయా
చాపలనేత్రియబ్బెనని సంతసమందితవంతెగాని, యీ
రూపముఁ గాంచు నంచుఁ గలలోనయినన్ దలపోసి
నాఁడవే?—

కలదే యామెకు పేర్మి మసీపయిని?—యీకష్టమ్ము
తేలాగునన్

గలుఁగునె నిక్కమ మేని యుర్వి?-శరసంఘా
తమ్ములన్ నీవు, తి
వ్వలు వడ్డన్ గని యూరకున్న యది?—
పూర్వప్రాణనాథుండు చి
క్కులు వడ్డన్ గని చింతనందెడి నో?—
నీకుఁ బ్రేమమ్ము నిండించి యును.

ఇప్పటికైన నీమెద శమించెనె?—ఎందులకూరకుందువు—? నా
కప్పురగంధి వెంటబడి, గ్రుక్కనబర్వెడు చుండనో కొక్క?—నేఁ
జెప్పెడి దేమి?- మానవులు, చెచ్చెర వచ్చినదానిఁ దన్నియున్
మెప్పొనరానిదానికయి మేల్పుచునందురు! నైజమే గదా?

—♦ చెలి ♦—

హేలినాకాంత సుధారసమ్మువయి నెంతేఁ బ్రేమ ముద్దాడి, త
ల్లిలనారత్న సుధామయాంగముల స్పర్శా సౌఖ్యమున్
[బొంది, ప
ల్కులు నెంతే యమృతమ్ముఁ జిల్కఁగ, నోడల్ పూఁబోడి
[యాలింగ నం
బుల సంజీవన మందు నీ వెట్టులఁ జావున్ గాంతు నంచెంచెదో.?

ఆ మొవిక్షేపణమున, నిట్లధికమైన
యడలుజెందెదవంతె, గాయమునఁ గాదు,
నే నెఱుంగనా? యిపుడైన నేగుమటకు,
అమృతముఁ జిల్కి, రక్షించునామొ, నిన్ను.—

— ♦ ఇనోని ♦ —

అట్లనకుమమ్మ, నెచ్చెలీ! యదిగో!, చూడు,
కలదు మనయింటిముందు వృక్షమునకల్లి
తీవయొక్కటి, యెఱ్ఱనిపూవుఁబూచు-,
దానిఁ గొని తేగదమ్మ! సత్వరమునీవు.

— ♦ చెలి ♦ —

ఔషధము తెచ్చి బ్రతికింతు ననెదవీవు
భ్రాంతివడి; యయ్యో! వట్టిగోలవు కదమ్మ,
బ్రతికెనా హెంలినాకాంత పంటబాడుఁ
గాని, సుంతేనిఁ గనులెత్తి కనఁడు నిన్ను.

ఎపుడయినఁ, గష్టజీవితమేగదమ్మ
నీది!?- బ్రతుకనీ, మఱి, చావనీ, యికండు!

బ్రతికెనా వీఁడు కంటకప్రాయమగును-
నీవు బ్రతికింపఁగూడదమ, చావనిమ్ము!

ఆఁకటి నాత్మ- నిద్దుర యెఱుంగక యెన్నిదినాలు నీవు చిం
తాకుల మానసమ్మున మహాభయదాటవులందు నేఁడ్చితో!
ఆకలిదప్పులన్ దెలియకయ్యెయు, నేనుదపింప నీకునై
ఆఁకటి నాత్మఁ డిట్లు మృతినొందవలెన్ గతిలేదువానికిన్.

నెలఁతగఁబుట్టినంతటనె, నీచపుఁజూపున వీఁడు-చూచునే!
చెలువను, దన్నుఁదప్పమఱి చిత్తమునం దితరమ్ము నెంచకే
మెలఁగెడు మానినీమణిని, మేలుదలంచక చిన్నబుచ్చునే!
కలుగవు వీనికిన్ గతులు- కాంతలరోషము లేకపోయునే!—

లలన! ప్రతిపనిలోఁగూడ, లాభమింత
యేని లేకుండ జేసెడు మానవులను
యజ్ఞులందురు- మఱి, మూర్ఖులందురింక
ఈవు చేయుదానన్ ఫలమేమి, చెప్పుమా?

—♦ ఇనోని ♦—

ఆవేగమ్మును జెందకమ్మ, చెలి!- యాయాసమ్మునఁగల్గించనీ,

ఆవాత్సల్యమువీడునే, జనని? పుత్రప్రీతిఁ బాటింపదే?
మీ, -వాణిజ్యము ప్రేమతోఁ దుతనె? తానేకార్యమేనిన్ ఫలా
భావమ్మూహాంయొనర్పి చేయవలెఁబో! వారేమనీషుల్ ధరన్.

దేనిఁ బ్రేమింతుమంచువో, దానినీర్ష్యఁ
బూని, వధియించి, నాదయాపూర్వమైన
పరిణయమని చెప్పికొనుట లే?- లజ్జగాదె?-
ఇంతకున్ మించు లాభమ్ముఁ కేమి వలయు?-

ఈవు ప్రేమించితివి- దానికింత ప్రేమ
పరులుగూడఁ జూపింపఁగావలెనటంచు-
పాడువర్తకమున కేలఁ పాటువడెదు?-
ధరణి నుత్కృష్టగుణము వర్తకము, చెపుము!

మానినీ! ప్రేమమునకు సమాగమమ్మె
ముఖ్యమా?- లేనిచో ప్రేమముండఁదగదా?-
ఈపరిణయసూత్రములనెల్ల నేనెఱుంగ
నేనునడచుట కాత్మ చుక్కాసినుమ్ము!

—♦ పారిసు ♦—

ననునిందించెదవేల యూరకకటా!- నాయందుదోసమ్ము గ

గ్గునె?- యీనీచెలి యిట్టులుండుటలు నాలోపమ్మొ-
[సౌఖ్యమ్మునున్
గనవద్దంచు వచించినానె?- యొరులన్ శాసింపనే నెవ్వడన్?
మనుజుల్ - భూమిని వారివారి సుఖముల్ సాధించుకోరే?
[చెలీ!

తన సౌఖ్యమ్మును తాను చూచుకొను స్వాతంత్ర్యమ్ము
[ప్రాప్యోళి పు
పుట్టిననాడే కొనివచ్చె, చేఁగొననివాఁడే బాధ్యుఁడౌగాని, త
క్కినవారేటికి నింద్యులౌదు రికఁ? నాకిష్టమ్ముగా నేఁ బో
యినచో దోషినె?- నీచెలిన్ వలదటంచెవ్వండు శాసించెనో?

తమకనురక్తిగల్గిన పథమ్ముఁ బోవును జీవకోటి, సా
జమయిదిలోకమందునఁ కుశంకజనమ్ము భయమ్మునొందుటల్
విపులమతీ! వివేకమొక పీసముఁ గ్గుటచేతగాదె? ని
క్కము పాణికంపమ్ముటన్న నిదిగాదె? యెఱుంగరు గాక
[మానవుల్.

చంచలము కాదు ప్రేమ, యెటంచుఁదలఁచు
వారు మూఢులు- మనసె యాధారమగుట

అనువుపడమి పతివ్రతయగును, కండె
మనమునం దైన, వ్యభిచరింపని జనమ్ము?

పాపమటంచుఁ బల్కెదరు, పాపమనంగ నదెట్టులుండు?- నే
పాపముఁ గూడఁ జేయనివిభ్రాన్తుఁ డెవ్వఁడు?- శిక్ష జేయఁగా
నోపు నెవండు?- వాఁడు నఘ మొక్కటియేనియు జేయఁడే?-
వృథా శాపములేల? మింవలచుదారిసబొందిక, లేవు
[పాపముల్.

మనము, మఱియొక వాతావరణమునందు
పెరిగియుంటచే, దీనవచ్చెరువుగలగు,
ప్రథమసిద్ధాంతముడిగి, నిష్పాక్షికముఁగ
నరయుఁడీ, మీకు నిజము తనంతఁదోఁచు,

ధైర్యవతిగాన 'హెలిన' సంతసముఁ గందె,
అబలగాన "యినోస" దైన్యమ్ము నొందె,
తనదు లజ్జాభయమ్ములే తన్నుఁ జెఱిచె;
నన్ను దూరిన, నేమి దానఁగలుంగు?-

మలినమనమ్ముతోడ, బ్రతిమాలఁగ రానబలా! సుకమ్ముకై

పలుపుటయత్నముల్ మనుజ సంతతికెల్లనుసాజ, మందుచేఁ
జెలిమి నలంచి వచ్చితిని; చెప్పను లేదన, వెళ్ళిపోయెదన్
తెలియు నికొంచము, కిల్బిష. మిదే-నయమంచుఁ, దలంతు
[ నెప్పుడున్,

— చెలి —

పసరమ్మా! తుదిముట్టినేయుకను నీ ప్రాగల్భ్యముల్, కాశయే
దెస నేనింక రవంతయున్న యదె? యేమీ, వెళ్ళగక్కింపుమా?
కసవున్ మేసెడి జంతులట్ల నరలోకమ్ముండగావచ్చు, సం
తసమారీతిని పొందవచ్చు, జననీ దారాద్యభేదాత్మతన్.

నిజము వచించినావు. ధరణీస్థలి మర్త్యుఁడుఁబుట్టినమ్మ, కా
యజనిగమాపబోధనమునందున, భోజనశాస్త్రమందు, న
క్కజమగు పాండితిన్ బడయఁగా సుఖియై నివిగల్గనేని,
యా సుజనునకిద్ది సత్యమగు చూడ్కి, విపక్షములస్యదృష్టలో

— ఇనోని —

చెలియా! దూరకుమమ్మ వాని, నెరనుల్ సిద్ధించు, నెంతేసి
వాగల కార్యమ్ములనైనఁగాలమరుగన్ లక్ష్యమ్ముదృష్టించి

నారలె సర్వోత్తము లౌదు రింపులకు, నీర్ష్యా బుద్ధిపాటింతురే
యిలనీ పుట్టిన నేకమానసలు? మందీవే దుశ్చిత్తమ్మెగియున్.

—♦ పారిసు ♦—

ప్రాణము కడబట్టెన ద
బ్బా! నాకును చెప్పరాని బాధకలుగున్
పో నేరవు ప్రాణమ్ములు
నేనెంతఁగ నడలవలెనో యికమీఁద నిటన్.

(మూర్ఛిల్లును)

—♦ ఇనోని ♦— (ఆతురముతో)

నాథ!- నానాథ! నా ప్రాణనాథ!- యెంత
వగపుఁ గల్గెనురా, నీకు? బ్రదికి, హాయి
గాను, హాలీనాకుమారి చెంగటనయేని,
సౌఖ్యమందనీయదో? విధి, సాంద్రకరుణ!

(పారిసు లేచును.) (ఇనోని చెలితో)

వెడలిపొమ్ము! సత్వరము- జీవింపఁజేయు
మూలికన్ గొనితెమ్ము పో!- జాలమింకఁ

జేయకమ్మ! వేగ మెతమ్మ!- చెడునుకార్య
మమ్మ!- ననుజంపుకొన్నట్టు, లాలసించి తె?-

(కన్నీరునించుచుబోవును.)

—♦ (కన్నీటితో) ఇనోని ♦—

హృదయేశా!వగవంబోకు,మిటులయ్యో నాకటంచున్,ధరన్
విధిచై దమ్ముల దప్పనేరితరమా? వీక్షింపవే, గొన్నినా
ళ్ళ్యదవున్ వెన్నెలఁ గొంతచీకటిగదా! లోకంబునం దేరికిన్
దుదిదాకన్ కైతలా! సుకమ్ము? యెఁబలొందున్ సత్య
[దృష్టిన్ గనన్.

జననమ్మొందితి రాజవంశమున, విశ్వవ్యాప్తమా కీర్తిగాం
చిన సౌందర్య విలాసయౌవన కళాసేవ్యన్,గుమారిన్దగన్
వనితారత్నముజేసి, హర్ష జఁ ధిన్ సౌఖ్యమ్మునందేలి నా
వనఘా! కొన్నిశరత్తు లీక్షితి గలండానీసమానుండిఁకన్.

(నేపథ్యమున)

ఏడీ!- యెచ్చట నన్నవాఁడతఁడు?- రానేవచ్చెనా తప్పఁడో
వాడీదారిని, జ్ఞాపకమ్ముగలదా? వాఁడింక నేమోమునన్

జూడంగ లైడినొక్కొ? మమ్మ; "హెలినాశుద్ధాంతమున్
[వీడియున్
రాఁడే? యెప్పుడుఁగూడ,- వాఁడిపుఁడిటుల్ రాఁగారణం
[బేమిటో!

[అంతట ఇనోగీ జనకుఁడు ప్రవేశించును.)

నరరూపమ్మున నున్న రక్కసిక్రియున్ బాటింతునిజ్జూడ రా
సరలోకాధమ! యెంతరానివిపనన్, రావిప్పు- నీమీఁద దు
ర్భరపూ ప్రేమకతమ్మునన్ నవసి నిద్రాహారముల్ మాని
మందిరమున్ వీడిననమ్ములన్ దిరుగుచున్ జీవించునీ యోగినిన్.

పలువా! దారుణరీతి నన్నుదహింపన్ జొచ్చెనీ శోకమిం
దులకీ వేగద కారణమ్ము!- మొదలేదూరమ్ముగాఁ బోకయీ
లలనన్ బెండిలియై యనంతరము సంబ్రమ్మున్ వడిన్
[దాటియా
హెలినాకాంతను దెచ్చి దీనివిడువన్ హేయమ్ముగా నెంచవో

హృదయమ్మన్నదియున్నదే! అయిననీవీలాగు వర్తింతువే?
వదనిన్నెవ్వరు బ్రోతురోగ నెద- ఈపాపమ్ముపోవంగఁదుం

చెడనీకంఠము ఖడ్గధారనిదె, లే, చేరంగిరమ్మింకఁ బా
పెదనేనా హాలినానిజేశుని వ్యధన్ వేగమ్మునిన్ జంపియున్.

## —♦ ఇనోని ♦—

జనక! యెవ్వని కోపింపఁజనెద విభుడు
నన్ననుగ్రహించుటలె నానాథుఁజంపఁ
దవి రెదవు నీవిపుడు మఱి యవనియందు
ఇటులనైన నేనుంట కీవిష్టపడవా?

తప్పులేనట్టివారలు ధరణిగలరె?
తండ్రి!- దేవతలైన యీతప్పిదములు
చేయఁగాలేదె? విధియిట్లు చేయుచుండ
ఒకరి నిందింపఫలమేమి యొదవునయ్య!

మన జుల్ గొంచెము కార్శ్యభాసమగుపింపన్ దైన్యమున్ [దోషఁగాఁ
గనులందించుక నీళ్లురాల్పననుదుఃఖమ్మందు; హాసమ్ములన్
దన వొక్కించుక పుష్టిఁజెందుటలు నానందమ్మటంచ దు- పే
ల్లను భావించివృథాగ్రహమ్ముఁ దలల్ ఖండింప జేసితి యో?

నా రాజ్యమ్మునఁ జెప్పిరక విను మయానందమ్మునన్, జక్షులన్
నీరున్ రాల్చుచుఁ గాననాంతరములందే వాసమున్ బూని
యాహారమ్ముల విడియుంట- దుఃఖమున, హర్మ్యాగ్రమ్ములం
[దేఃహా
రారామమ్ముల హేమమున్ దినుచు దేహమ్మున్ వసిక
[బెంచుటల్.

ఏ మహాకవి వ్రాసెనో యీప్రబంధ
మతివిచిత్రనామమ్ముల నన్నిటికిడి
భ్రాంతులయి సంచరింతురి విూరంతె గాని
దీనితత్వమ్ముఁ గూర్చి వాదింపఁ బోరు.

సంకుచిత దృష్టి నెప్పుడీ జనుఁడు దాల్చు
నపుడె, దోషమ్ము మంచియు నంటివచ్చుఁ
గాని, దృష్టివిశాలతఁ గాంచినపుడు
లే నెలే విన్ని భేదంపు దృష్టులయ్య!

## —♦ తండ్రి ♦—

అయయో! యెక్కడిపిచ్చితల్లివి కదమ్మా! యిట్టు
[లన్యాయమున్

నయ మొక్కింతయు లేక చేసితతనిన్ జంపంగ వద్దంచు నె
న్నియొ ధర్మంబులు నీవు పల్కెదవు, తానే కర్మమున్ జేయ
నంతియు తానొందు నితండు వీడెం- గరుణన్ నేడెట్లు లాసిం
[చెదిన్.

మొకమునన్ దరహాస చంద్రికలు గాయు
రొడలి కెలఁ బ్రాయు మొకవింత హాయలఁ గూర్పు
చంపక సుమమ్ము రీతి నెసంగు నిన్ను
నెన్ని నాళ్ళయ్యొ జూచి సహింపఁగలనె?-

నీ చీర చినుఁగులన్నిట నీ యెదను జించు
నీ శోక తైక్ష్ణ్యము నెన్నవచ్చు
ప్రతిభఁ దొరంగిలో పలకీడ్చు కన్నుల
నీ చింతలోతు గణింపవచ్చు
అమృతమ్ము లుకు శరీరము పాలిపోఁ జేయు
నీ దుఃఖశిఖ వేడి నెఱుఁగువచ్చు
కడుఃజలాన్వితవిల్లు కార్శ్యమ్ము నొందనీ
దుఃఖమ్ము శక్తిని దూచవచ్చు

ఈ మలినవస్తువుల్ మఱి యీ విశీర్ణ
కుంతలమ్ములు- నీ విరక్తులు- పరాగ

పటలమలిన దేహమ్ము- దాపకము లేక
చెప్పకయె చెప్పనీలోని చింతతల్లి!

తమ పొలమ్ములఁ బండు ధాన్యమ్ముతోఁ దృప్తి
సాధించునట్టి కర్షకచయమ్ము
తమయాదువారినిన్ దగిలిసంతోసమ్ము
నలవరించుకొను కన్యాజనమ్ము
తమజనకులకు సంతసమొసంగుచుఁ బ్రేమ
గణనకెక్కెడి యువకవ్రజమ్ము
తమవలెఁ గాకుండ తనతమయిల్లాండ్రి
రోయులేకనని పూరుషగణమ్ము

యిండ్లఁ బాడు వెట్టి- యేడుపు మోపెట్టి
వృద్ధజనుల ప్రాణ మెగిరిపోవ
యువతులకును భూమినంటఁ గష్టమ్ముగా
నెవఁడు దెచ్చిపెట్టె నీరణమ్ము.

ఎంతటిఘోరమిద్ది! జనులెందరుజచ్చి- రనాథలౌచు నీ
మంతినులెంతమంది తమమానముదూలఁగఁ భంగమందిరిం
కెంతటికష్టముల్ గలిగెనే పసిబిడ్డలకయ్యొ కూఁతురా-
యెంతటిఘోరమిద్ది?- యిది యెవ్వరికారణ మోవచింపవే-

ఈఘోరమ్మునకంతకీఖిలుఁడు గాఁడే హేతువోరీ! నమ
స్తాఘమ్ముల్ నినుఁబాసిపోనిదిగో హా న్యస్తశస్త్రమ్మునన్

—♦ ఇనోని ♦—

జనకా! యింతకుఁ శాంతిఁబూను మతనిన్ జంపంగ [స్వాతంత్ర్యమే
ఘనుఁడిచ్చెన్ మతినీకు? మానవులలోకంబందు సృష్టించిచ
య్యన విహాపొండొరుఁ జంపుకొండనుచు సర్వాత్ముండు [శాసించెనే?-
మును నెవ్వండు సృజించె చంపుఁ దతఁడే పో, నీవు దేవుండవే?

దేవునిబిడ్డఁడీతఁడు కదే! యిటుజంపినఁ గోపమూనఁడే?-
నీవిటులాచరించుటలు నీతియొ?- వేరొకరెవ్వరైన న
న్నీవిధిదూలనాడి వధియించినఁ గన్నులఁగెంపునూనవే?
నీవతనిన్ క్షమించెదవే? నీతగినంత బరాభవింపవే?

ఏవిధి నిచ్చిపోయినది యీతనికిన్ హెలినాకుమారికిన్
దేవతయుంట[illegible]మో? -కలదేయిఁకనీతనితప్పు? భాగ్యముల్
రావలెఁగాని వచ్చినను గ్రక్కున నీవును గూడపుచ్చుకో

వే? వలవంచుఁబల్కెదవే?- యేటి? యుపాధి తండ్రి!
[వల్కుటల్.

కొందఱు దుర్బలాత్ములిటు క్షోణితలమ్మునునుండఁగూడదో
అందఱుగూడనీవలె బలాన్వితులే ధరనుందురే?- యికన్
సందియమెల్లవీడి, బలశాలులు దుర్బలశాలులన్ వధిం
పఁదగునయ్య! యియ్యదియొ పాడియటయ్య ధరాతల
[మ్మునన్

(తండ్రి ఊరకుండును.)

—♦ పారిసు ♦—

అతిభయంకరమైన దావాగ్నియందుఁ
ద్రోసిపోయితి- నీతనిఁ ద్రుంపుమయ్య!
స్వార్థపరుఁడు, వంచకుఁడు, దయావిహీనుఁ,
డితఁడె-కా, నీ తనయకిన్ని వెతలుగూర్చె.

ఎవరికతమ్మునన్ గలిఁగె నీబెడిదంపురణమ్ము- వీరశా
త్రవదళనమ్మొనర్చియిట వ్రాలిరినేఁడు మదగ్రజాది బాం
ధవులు- మహాగ్రకీర్తిఁ గలవన్బలు నెత్తురుటేర్లు బారె,
నియ్యని సకలమ్మునావలననా ఘటియిల్లె నదెంత బాపినో?-

జననమ్మందిననాఁడె "యాఖిలుఁడు వంశంబెల్లఁ గాల్చున్" నిజ
మ్మని, ఘోరాటవిఁ ద్రోసిపోయి రశనమ్మై ప్రోవు [వ్యాఘ్రాది జం
తుని కాయమ్మునకంచు- నొక్కటయిననన్ బోకార్ప; [దిట్లుండ, దే
వుని యిష్టంబిఁక- నన్నుఁ దిట్టు నెడ నేపుణ్యంబు చేకూరెడిన్.

నిజమే, ప్రాణముకన్న నెక్కుడుగ నన్ బ్రేమించి గష్టమ్ములన్
భజియించెన్ సహించెనావలన లాభంబుండనీపోవనీ
సుజనమ్ముల్ నుతి సేయ సద్గుణమునన్ శోభిల్లె నన్నావ న
క్కజమౌ తోడఁబాయఁ బూన, నేటికయినన్ గాదంచు భాషింతునే

ఔరా యిట్టి మహాపతివ్రతలు లోకాగాధ్యచారిత్రలు
న్నారా? కాంతలయందు, వారి యెడలన్ గాముండు లేఁడా? [కదీ
యారంభంబుల శీలమింతయును పోదా? యింకనిన్నాళ్ళునే
నీరీతిన్ దలపోయుటల్ నిజముకాదే-స్వప్నమే? మాయయే?

తరుణీ! లోకము నుద్ధరించెనిక నీధన్యాత్ముఁడంచున్ ననున్
చిరమాభక్తిని, బ్రేమజూతురనుమున్ నేనెంచి గర్వింతు నీ

వలె, కాగర్వము సత్యమే? ననుమహాపాపాత్ముఁడంచున్ జనుల్
గురువిద్రోహి నటంచుఁ గాంతలు, కడున్ గోపించి నిందింతురే?

ఇది స్వేచ్ఛాపరిణయమ్మటంచుఁ గడు నుత్కృష్టమ్మటంచున్
[ధరన్
బదినాళ్ళయిన నభీష్టరమ్యయువతీ బాహాపరిష్వంగమున్
మదనామ్నాయుల సద్విచారమును సంపాదించు తేజమ్మకున్
విదితమ్మాపర మార్గమంచు ననుకొంటిన్, బాపమేయింతయున్

ఇది బలవత్తరమ్మయిన హింసయె కాదె! మదీయధర్మముల్
వదిలములంచు నమ్మి, యెలప్రాయము పాపులపాలు సేసి యా
పిదప ననేకదుర్గతుల వేసటఁ జెంది ననున్ దలంచి, తి
ట్టెదరొకో! వీని నమ్మి యెగడించితి మీసుకమంచు గోర్ధరా

నవనవలాడు పుష్పములు నాకరినాంఘ్రులక్రిందఁ జిక్కి - వై
భవము నడఁగి, యెన్నికఁ బాడయిపోయెనో?
[పెంచినట్టి మా
నవులును గూడ రోయఁగ; గనంబడవాయెను పాడు
[గర్వమున్
దపిలిన గార్దభమ్మున వృథాయయి పోయెను జీవితమ్ములన్

జంతువుకన్న హీనమగు చర్యనుబూనితి, మానవుండనై
గొంతులుగోసితిన్, కసుమకోమలులెందఱకో? నిజమ్మునా
వంతయెఱుంగకే కపటమైనసుకర్మ్మ, నిజమ్మటంచు దు
ష్కృతుఁడనై వచించియిటు జీవితమంతయు వమ్ముజేసితిన్

మానుజుఁడు మేలుపో పశుసమాజముకన్నను- చిత్రవృత్తులె
ల్లను నియమించుమానవుఁడు, రాదదిజంతుల; కీనరుమ్మునే
ఇనకపశుత్వమున్ గొలిచి వీరుఁడనంచును విఱ్ఱవీగితిన్,
మానుషమెఱుంగకుంట నిటు మోసము నన్ బడిపోతినక్కటా

మంగళములన్ గలింగెడిని! మానవతీమణి! నీవు, నీవలెన్
అంగనలాత్మపూరుషులు సంచితధర్మప్రధానరక్తులై
భంగిపతివ్రతాత్మలయి భాసిలుచుందురుగాక! ఆ జన
మ్మునగను దేశమాతయుశమంగనుగావుత! లోకమందునన్.

పలుతరవ్యధలన్ నినుబాధపెట్టి
చెలియ! నే నపచారముల్ జేసినాఁడ
వానినన్నిటిఁగూడ నీమానసమున
నుంచఁబోకిదె నినుఁ బ్రార్థించుచుంటి.

ఏను జనిపోయినపుడు నన్మృత్యు దేవ
తాసభాస్థలికీడ్చుక తరలునపుడు
ఘనభయంకర నిబిడాంధకారమందు
అతివ! నీప్రేమ వెలుఁగు సాయమ్ము చేయు.

నిలుపులేకుండ చెవులు బ్రద్దలుగ మ్రోయు
ఆక్రోశాట్టహాస శబ్దాంతరముల
దివ్యమధుర మీకాలి యందియల రవళి
మువుల యానందమిచ్చి నా చెవుకు మాన్పు.

కఠిననిస్సార భీషణ గర్జనముల,
కడమెలేని నిందాతిరస్కారములను,
రమణి! నీమృదుమధుర వాగమృతమెడలి
చెదరిపోవు జీవమ్ములఁ, గుదుటఁ బెట్టు.

విడువు మొక్క బాష్పమ్ము! నిన్ వేడికొందు
జననమాది విరామమే క్షణముగూడ
లేక యెన్నో యకృత్యముల్ జేసియుంట
ఘోరదావాగ్నినట్ జుట్టుకొన్న యపుడు
సిలుగులన్ బడనీక రక్షించు నన్ను.

విడువు మొక్క నిట్టూర్పు- నేబడవ నెక్కి
చటుల దుర్గంధవారి సంచయములందు
జలచరమ్ములఁగడచి పోవలయు; నవుడు
ఒక్కతోఁపున గట్టెక్కఁయు-

విడువు మొక పేర్మి తలఁపు- నన్వాడఁ నీక
కాతపట్టి స,ప్రాసాది సాధనముల
భయద చక్షుఁనిప్పుకల్ వ్రాఁగ్రమ్ము
మృత్యుభటులను వెర్రివారిగను జేయు-

విసిఁగితినేను; చాలునీవెత్తినాకు
ఇదియె కడసారి నీకు మ్రొక్కెదను జెలియ!
ఎన్నితప్పులు జేసిన నించుకైన
దయను చూపింతుగా!—చాలు— [పారిసుఖక లేదు]

—♦ ఇ నో ని ♦—

నాథ!—పోవుచుంటివా నన్నువిడి
పరమ పాపాత్మురాల- నీప్రాణముఁను
నిలుపఁగల్గియు నేనిల్పనేరనైతి
నమ్మివచ్చినవాని సంక్రమముఁ విడచి.

చెలియా! రావుగా - నేచచ్చువఱకు రావు -
ఎవరునా ప్రాణపదము - నేనవరిమీఁది
ప్రేమచేత నీయిటుల జీవించియుంటి -
అతనిచూపింక యీపృథ్వికుండు లేద! -

అకట! వాడిపోయెను సకలాంగకములు
ఎంతదావాగ్నిలోనఁ దపించినాఁడొ? -
చూడఁగల్గుచున్నాను మోహేడు రీతి
పాడు ప్రాణము లీయొడల్ బాసిపోవు -

అగ్నిదహియించుచున్నదీ యంతరంగ
మెవ్వరెడబాసినారలో యెఱుఁగకుండ
వారిదహియించకుండ చల్లారగలదె?
నేను నినువెంబడించుచున్నానులెమ్ము -
[ఇనోని క్రిందపడిపోవును.]

—♦ చెలి ♦— (ప్రవేశించి)

(క్రిందఁగూలఁబడి ఇనోసితలను దన చేతులతోఁ దీసికొని)

ముగిసెనె దంతయున్నరులు మోహముతో నొక జంతువింక నొం
డగు విషవృక్షమున్నరుకునం పుదలంచిన యాయుధమ్మె యా

వగ- ఫలవృక్షమున్న రిక్తె; వర్షము గోరిననేను తాపమా
ర్పగ పిడుగున్ బయిన్వయిచె- భావనకందవు
[ధాన్య చైదముల్,

మనఃకిన్నాశ్చైద బాటులేక యిపుడీమాడ్కిన్ బ్రవర్తిల్లెనా?-
ననుఁగోపించియు వీడిపోయితివె ప్రాణస్నేహమున్ నెచ్చెలీ!
నిను నేవీడిన జీవముల్ నిలుచునే? నేనింకనిచ్చోటనే
మొనరింపఁగావలె వచ్చుచుంటినిదే నీయున్నట్టి లోకానికిన్
[ఆ మొయిక లేదు.]

—♦ తండ్రి ♦— [కన్నీరువిడచుచు—
ఈఘోరమ్మఖిలమ్ము చూచుటకు కాదే నేనుజీవింతు-నా
రా; ఘూర్ణిల్లెడు నీయెడందయుఁ కఁగ ర్తవ్యమ్ము నాకేమిటో

ఇనియొక విచిత్రిమాకల-యిడిజరించు
నప్పుడింపుఁడు తన పూర్ణహస్తములను
జాచి దీవించినాఁడు—ప్రిసన్న మధుర
గీతి నాలపించినది కోకిలముగూడ—

ఇప్పుడా కల భగ్నమైయెగిరిపోయెఁ
గను భయంకర దృశ్యముల్ గానఁ బడియె

తల్లడిలి లేచితిని! వాఁడు దనముదోవ
పారుఁ జాబిల్లి-పికమును బాడదిప్పుడు—

ప్రకృతికూడ అభీకర స్వప్నమందె
ఐక్యమైనఁగదా! -కాక-స్వప్నాంతరస్థ
లోకములలోనె యింకను ప్రాకులాడు చుంటినా!—

[స్తబ్ధుఁడై నిలచియుండును.]

# మునిమాపు.

## అర్పణము.

ఈలతకుఁ గారణమ్మైనవారి మొదట;
పాఁకి రెవ్వరుదీనిని, జలముపోసి
కాపరు తెలిపిరాఁ, దుది దీని వృద్ధిగనక
పోయిరెవ్వరో— ఆప్రేమపూజ్యులకును—

అదిది రావనానమ్ము; భయంకరమ్ము
లైన కల్లోలములనెల్ల నంతరంగ
మందె దాచి ప్రశాంతమ్ము నలవరించి
రమ్యముగఁ బాఱునదియ కాళంగితటిని.

మిట్టిపడు చేపలన్నిటిఁ బట్టి, బుట్టఁ
బెట్టి, కొంపోవుచున్నాడు బెస్తవాఁడు
ఎగసిపడు కిరణములన్ని దిగిచి వెంటఁ
దీసుకొనిపోవు భానుని తెఱఁగుఁ గాను.

బుడుతఁడొకండు, సుంతతడివోవని సన్నని సైకతమ్ములన్
గడు ననురాగమూని కనకమ్ముటు గొంగున మూటఁ గట్టియున్
విడుమను తల్లిమాట చెవిబెట్టక గంతులు వేయుచున్ బరుం
గిడుఁ దనతల్లిపై చెఱఁగుఁ గేలధరించె హాసన్ముఖమ్మునన్.

కెలనఁగల యాలయమ్ము వాకిటను నిలచి
లలిత మోహన ముగ్ధకలాపగీతిఁ
బాడుచున్నది హారతిపాటయేమొ,
పక్షి జవరాలొకర్తు సంబరముతోడ.

తరుణులు మహాపురీపురము దారులనొండొరు కేలువట్టియున్
దరునగవుల్ మొగమ్మునవసింపఁగ, నస్గనియేమొయేమొ, వి
స్తరగవచించుకొంచును, వికస్వరమానసలై, సుదేభసుం
దరగమనమ్ముఁబూనిచనినారు, విదుర్చుచుదృక్సరోజముల్.

దవ్వులందున నటురహాదారిమీఁదఁ
బాంథుఁడెలుఁగెత్తి స్వేచ్ఛఁగాఁబాటపాడు
కొనుచు, నడచుచున్నాఁడు— సంకులముగాను
బోవుక్రేపుల యురవులున్ బూడిపోవు
లలితసాయాహ్నకాల గర్భముఁజిక్కి.

తరుగనిపైనమూని యుదెద్వాదశిచంద్రుఁడుతోఁవలేనియం
బరమున నల్లవేళల రవంతవిరామములేక స్వేచ్ఛనే
మఱచిధరిత్రిఁజుట్టి పలుమారుఁ బ్రదక్షిణమాచరించుచు
తరుగనివంతఁ జల్లపడి, నేత్రములందున నీరునించెడిన్.

వచ్చుచున్నవి, పాటపాడుచు నెఱకుఁగా
నరిగినయట్టి విహంగరాజి
చనుదెంచుచున్నది, శ్రమయునానందమా
ననములవెలుఁగ యానాదిమరాత్ర

నడచుచున్నారు, సన్నని కూనరాగాల
నెడ్లతో మెల్లఁగఁ గృషీవలులు
అరుగుచున్నారు, విహగమ్ములకై యేటి
కడకు వచ్చిన యువకవ్రజమ్ము

ఎవరిఁ గనుఁగొన్న నుల్లసమింపు నింపి
యెడఁదలుప్పొంగ మోదమ్ము వడయువారు
ఎవరి మోములు సూచిన నింతయేని
విసుగుపొడమైన లేకయే వెలుఁగువారు.

ఎవరికివారలీ జగమునే తలపోయక నిర్మలప్రమో
ద విభవకాంతులన్ మొగము దామరలుజ్జ్వలకీర్తి నుల్లస
మ్ము విరియఁ జేయఁ దూర్ణగతిఁ బొంగెద, రన్యవిషాదగాథలె
య్యవియును గూడ వీరిహృదయమ్ముల రావహా! యెంత
[పుణ్యులో.

వారికివారివారి పనిపాటలతోడన సెల్లగాల, మిం
పారఁగ నించుకంతతఁటి యుబ్బిన, ...న, విరామ మోదముల్
తీరు ...నారు వా...దెదరు, చేయరు ...నె తృప్తిహా! ధ...
వీరల... జో తెనన్నను జనింపఁగఁ జేయవదేమిరా! విధీ!

కనుగనువారలొక్కరయినన్ గనుపట్టరొ? యేటి
[మాట? యీ
కనఁబడు గుట్టలంబడి సగంబయిపాఱు ఝరీతటమ్ము నం
దునఁ బెనుభూతమట్లు కనుదోయికిదోఁచెడు రావిచెట్టునా
తునఁగడుఁ గూర్చునెయ్యమయి, "కూడదఛీతి" యటంచు
[చెప్పదే!

ఏమది? నాకథన్ వినఁగ నెవ్వరులేరె?- మదీయజీర్ణశో
భామయ జీవితంబిటులఁ బాడయిపోవలెనే? ప్రపంచ చిం
తామయమైన యీయెడఁద, దారుణశూన్యమునందు
[నేకమా
సేమముఁ జెందగావలెను, ఛీ! ఫలమేమిటొ యిట్టిజన్మలో?

ఊటుకన్ జూతునె మెచ్చకేని, యిట సబ్బెనిల్వఁగాఁ
[జాల, నొం
టరిగా నెచ్చటికేఁగనేమియగుఁ జూడన్, విశ్వమందెల్లనొ
క్కరుగూడా కనుపించఁబోరె,- యిక నెకార్యంబునన్
[నేనను
ద్వార నిల్తున్, మఱిపాపిజీవము! యిదేలాపోవవేవీడియున్?

నిరుపమమైన వేగమున నిల్వక పఱ్వెడుచున్న వాఁడు చం
ద్రుఁడు; వియత్తలమ్మున మనోగతిమించ, ననేక దిక్కులన్
బఱచెడిఁ దారకాగణము పర్వెడి; విశ్వముఖమ్మునందు ని
ష్ఠురమగునట్టి శాంతమొక చోనయినన్ గనరాదు, గాలియున్

ఒక్కఁడ- యీ యనంత మహితోన్నత విశ్వమునందు నెల్లనే
నొక్కఁడ- యీ ప్రశాంత సమయోన్ముఖ నిష్ఠుర మాయ [ముందునే
నొక్కఁడ- యీ విశాల మహదుగ్ర నిరామయ శూన్య [మందునే
నొక్కఁడ- యాత్రిసేతు నిటులొక్కఁడనే- యొకతోడు లేకయే

ఒక్కఁడ- నొక్కఁడే నొకఁడ నీభయద ప్రపంచమం
దొక్కఁడ- నేనయేలిక, నదోకనుపించు జగమ్మునంతకున్,
ఎక్కడఁగూడ నాపలుకు కేమియునడ్డము లేదు, నాపనుల్
జిక్కులఁబెట్టఁగాఁగలుఁగు జీవులు లేరిక, నేనయేలికన్.

ఏమిరా!- యీ భయద ప్రపంచమునకా? యీ శూన్య [లోకానికా?
యీ మాయావృత విశ్వచక్రమునకా? యేనో, నిరాఘాటప)

జ్ఞామంత్రిత్వముఁబొందు నేలికను? నాకా! యీస్థితుల్
[లేనివో
యీ మోదమ్ములులేని రాళ్లుపరిచర్యల్ సేయుటల్?
[వహ్వా రే?

కాదవి- నేనుపాలకుఁడఁగాని,క నీజగతీస్థలమ్మునం
దాదట శోకమాత్రవిభవాత్ముఁడనౌనొక భిక్షుకుండ ను
న్నాదిని- యీయదృశ్యగుణమాన్యుఁడు కాలుఁడుజాలి
[నొంది నా
కోదనమిచ్చె హాహాత- ఆహా హాహా! భుజియించెద
[శూన్యమిచ్చుటన్.

కారా నేను విచిత్రమానవుఁడఁగానా! యీమహాశాంతలో
కారావమ్మున- నీవిశాలఘన శోకాభీలభాండమ్మునం
దీరక్తానన మేచకాకృతి మహాతేజస్వియీ కాలుఁ డిం
పారన్ నాకిడు శూన్యభోజనము ప్రేమన్ నేభుజింతున్ గదా!

రండోయీ! శశితార కాగణములారా! మేలమోచింపగా
రండో! విశ్వముఖాంతరస్థితములారా! ఓశిలారూపిణీ!

రండో! వేగమురండు! రండి! యిఁక నేలాజాలమీ
[పాత్రియట్

నిండెన్ నేనెరియొక్కండ నింతతినలేనేలేను, రారండికన్.

ఏమని? యుండి యుండి యొక పేరుతఱి, గొల్లుమటంచు లేచినే
నిరా?– మఱియెవ్వరో పుడమిమీఁద శరీరము విడిచినట్లుగా
నామనిఁదోఁచుఁ, గానిచో, వినంబడ నేటికి రోదనమ్మదే
యేమిటి కింక సందియము, లేతలపోసినదే నిజమ్ముపో!—

ఎవరో యభాగ్యులీకరణి నీవెతఁ జిక్కినవార? లేమి?
భువి నెవఁడో పునీచటుల భూరిభయంకర మృత్యుదంష్ట్రలన్
దవులక యుండు? నేనొకదినమ్మున నిట్టులెకండ్ల రక్తబిం
దువులు స్రవింపఁ గావగవనో! యిపుడైనను చింత మాసెనే?

అదియుఁగూడ పరిశాంతనిశాసమయమె!
అదియుఁగూడ నిద్రి నెఱుంగనట్టిదినమె!
అదియుఁగూడ విశ్రాంతిలేనట్టిదినమె!
అదియు నెప్పుడు మఱవరానట్టిదినమె!

పదములు తొట్రుపాటువడ, భావమదెంతొ చికాకు జెంద, నె
మ్మది మవియించు కేనిటువమూనఁగఁ, గన్నులఁజిందు
[నవుప్రిల్

విదిరిచి, మాటిమాటికిహరిన్ స్మరియింపుచు, మాతృపాద
[ముల్
వదలెనో శీతలత్వమును భ్రాంతినిజూచితిని నెన్నొ
[మార్లికన్.

వేకువ వేళకింత మఱి వేడిమియున్ బొడసూపునంచుఁ దా
నాకొన వైద్యుఁడున్, గనులబల్మిరుఁ జుక్కలఁజూచివచ్చినే
నీకరసీమలందడవి యింతయు మేలు గలుంగనుండి కూ
డా, కలఁగాంచితిఁ బ్రతుక దాయని, పైపయిడాయు
నేమ్ములో

అకటా! యెన్నిభవమ్ములెత్తినను, నా, కాశాంత గంభీర ప్రే
మకలాపమ్ముల దేహమ్ముఁ మఱచియుంపారంగ సౌఖ్యాబ్ధిపి
ికలందేలెదుభాగ్యముల్ గలుఁగునే? చింతింపనేమున్నదూ
రక? పోయెఁ మఱిపోయె, నావిభవముల్ సౌఖ్యమ్ములుం
బ్రిజ్జలుఁ

ననుజీవచ్ఛవమట్లుజేసి చనితే నాతల్లి! యెవ్వారికై
ననునాయీవగఁజెప్పికొన్న నణువై నాలాభమున్నే? తలం

చిన సత్కారముగా దహింతు, నెపఁబెట్టఁ జింతాదవాగ్నుల్
[గాం
మను వెత్తెత్తును, ఠెక్కులుండినవనుఁ జూపించు వారిఁ
[మునే!

మఱి మటలెట్లు? పరిణమాధురి కోరిక, దివ్యఁగోత్రిలిసం
బరముగ నీవిశిష్టమగు మంగళతేజము కన్నులారఁగా
సరసి తదీయ కాంతులఁ బరిభావృతగాత్రుఁడనై
[పొరింబొరిఁ
నిరుపమ సౌఖ్యమంది జననీ! యికనన్నుఁ గృతఘ్నుఁ జేసెదే!

దవ్వున కేగ దివ్యోలలితప్రభ తగ్గుట, లంకకింకముల్
దవ్వులనున్న చీకటులు దగ్గరఁ జేరుట. సాజ, మిప్పుడో
దవ్వులకేఁగు కొద్దియును దావక తేజము పెంపుజెందెడిన్
ఇవ్విధిచిత్రిమహా! నయిననించుకతగ్గవు కారుచీకటుల్.

ఇలపయినుండు మానవుల నించుకయించుక చూడతల్లి! నీ
సలలితకాంతినామదిని స్పష్టతజెందెను, నీసుశీలరో
చులుకనులందుఁగట్టెడిని శోభిలునీ దరహాసచంద్రికల్
పలుమరు నాయెడంద్రఁ గనుపట్టెడి, చీఁకటిఁబాఱదోలెడి

ప్రేమమయస్వరూప యెంకఁ బ్రేమకు జీవితమిత్తునేను- నీ
వేమఱి వీడిపోతివనుఁ, బ్రేమకు స్వస్తిని జెప్పినాఁడ- నీ
శ్రీమహిమాభిజ్ఞ, నాయసువులు, దుఃఖముతోడ శవమ్మునై
[యిటుల
మహితప్రభల్ మఱల నేత్రములన్ గనువేళ వేచెదన్.

తనయుండెంత యశస్కుఁడైన, బలవద్ధర్మానురోధక్రియా
ధనుఁడైనన్, గడుపాపియైనను, రవంతైనన్, ఖలుండంచుఁ బ్రే
మనువీడన్ దలఁపోయదీ ప్రణయమే మాతృత్వమ్ము,
[నన్యమ్ములౌ
జనులన్ గల్గదు- ప్రేమజీవికిదియే సత్యంపుచావారయన్.

హిమబిందువులును నవ్య మధుబిందువులును
భాసిల్లునీ ప్రసవంపు టెడఁద
సంగీతమును హరి చరణసేవారతి
యైక్యమైన యువినీయందుఁ బ్రేమ
కెరలి లేదివె రమణీయ వియా
కుంజమ్మునఁడియే గొనలు సాగు
సుఖమిచ్చి శోభించు సుగుణమయాఖముల్
నీముఖరవినంటి నిండఁబాఱు

ఇందుఁడొసఁగు నమృతమునఁ దృప్తిసనక
నీయనర్గళ వాక్కుల నిర్గమించు
నాసుధావాహినులఁ దేలునట్టికోర్కి
నమరవరులు నిన్గొనిపోయిరయ్యోదివికి!

సలలితచంద్రికావిమల సారపరీమళ పుంజమందు ని
ర్మలరుచినాననమ్మున విరాజిలఁగాఁ దిరునామముల్ పయిన్
నిలిచి మనోహరామృతఝరీతతి, వాక్కులఁబర్వఁగమ్రోఁ
మలగళమెత్తిపాడు నలమంగళతేజ మదృశ్యమందునే?

ఏనాఁడు నీవింటి కేఁగుదెంచినఁజూచి
యత్యనుపమముద మందినామొ?
ఏనాఁడు నీవువచించెడు హరికథల్
వింటిమో వీనులవిందుకాఁగ
ఏనాఁడు నీనవ్యగానస్రవంతిక
లో, ముదమున మేము గుంకినామొ?
ఏనాఁడు నీముఖభానుగనుంగొని
యబ్జంబులట్టుల నలరినామొ?

రావుగామాకు నావాసరములు మరల
పరగఁగలఁగాంచి తెలిసినకరణినయ్యొ

గా- ముదమ్మేది? తొల్లికల్గంగఁ జేసె?
నవియె యిపుడు కంటకమ్ములై యొగడఁ వరచు.

వేయి చిక్కులువచ్చి వేసటఁ బెట్టనీ
యాముఖమ్మున శాంతమ్మె యుండు
పది వేల సౌఖ్యముల్ పైఁ బడనీ నాల్క
తుదిరామపదమ్మె తొలఁగకుండు
తలమున్కలైన బాధలు చుట్టుముట్టనీ
యెదధైర్యమట్టులే వదలకుండు,
ఘనతరైశ్వర్యమ్ము కలుఁగనీ యెడఁద, ని
గర్వభావమ్మెల్ల కదలకుండు,

మఱపు రానట్టివాఁడు ధర్మమ్ము నెంచి
మంచిమార్గమునవి నిర్గమించువాఁడు
వేయి నూరైన మఱి నూరు వేయియైన
యారులకైన హానిఁ దలంపనట్టివాఁడు.

ఎసఁగు గంభీరమున వైరి హృదయమునగల
తీక్ష్ణరుచిఁ బాపించెను తెలివి- పేర్మిఁ

గోలుమువారలఁ గృష్ణఁజూచుకలిమిఁ గలిగి
ఖ్యాతిని వెలుఁగొందు సలసాసింహుఁడతఁడు.
దనుజరిపుసేవలో, వ్రతదార్ఢ్యమందు,
పరహిత ప్రీతిసాధనా గురుగుణమ్ము
నందు, ధీవిభవమందునందమం, ద
ఖండకీర్తివిశ్రాంతనవుండతఁడు.
గుణగణ మయూఖములనెల్ల గప్పిగప్పి
బ్రాహ్మ్యమును క్షాత్రమును రెండుఁ బ్రబలఁజేసి
బంధువుల మోముదామరల్ వాడిపోవ
చరమదశనందెనాభీష్మ చండకరుఁడు.

అతఁడుపోవుటలోన నస్తమించినది - ని
త్యము సమస్తగాచెను శైత్యలక్ష్మి
అతఁడు పోవుటతోనె యలిగిపోయినది భా
గ్యముపుట్టిల్లు సాగరజమాత,
అతఁడు పోవకముందె యాశ్రయించినది ముం
దొకనాఁడు విడువని దుఃఖకన్య
అతఁడుపోవుటతోన నడుగువెట్టినది, జ్యే
ష్ఠాదేవి మాకూర్మిసవతితల్లి.

క్రమముగా నొక్కరొక్కరు గడచినారు
నన్నుఁ బ్రేమమెయిన్ గనుచున్న వారు-
మిగిలియున్నాఁడ నేనొక్క మేయవాయు
జలధిఁ దన్నుకొంచూపిరి సలుపలేక.

ఆయిలు యిపుడున్నయది పెండ్లియయిపోయి
మిగిలిన గృహమేధి మేనపగిది
ఆక్షేత్రమిపుడున్నయది లక్ష్మిపోవగా
నిలచిన ధనికుని నిలయమటు
ఆతోట యిపుడున్నయది వెంట్రుకలుపోవ
మఱిబట్టగా వాని శిరము రీతి
ఆవీధి యిపుడున్నయది ప్రాణమెడలినఁ
చావక మిగిలిన శవమురీతి

ఉన్నవారిక మావార లున్నవన్న
జరగకుండెను గుడిని పూజారులట్లు,
ఉన్నదాయూరు యాపనముడిగిపోయి
కోరల మిగ్గిలిన ముసలి యవ్వరీతి.

*　　*　　*　　*　　*

ఎటుల నాతండ్రిఁ బ్రోచె- రెడింతలట్లు
నన్ను మన్నించినది ప్రాణమున్న నాళ్ళు
ఆమె చనినది- యవసానమందుఁ గూడ
కనఁబడఁడు వాఁడు నాకని కలవరించి.

ప్రేమ మెంతైన నున్నను విడువవలయు-
నన్నుఁ దన ప్రాణమట్టులఁ గన్నకొడుకు
కన్నమిన్నగాఁ బెంచి సుఖంబుఁ గూర్చి,
అలయుఁగా నేను, నెంతో చింతిలినదానె.

విధివిధానమ్ము వలన నేవిధినుండో
యిచటఁ గుమిఁ గూడినార లొకింత సేపు
కొలఁదిపనికయి- యెదితీర నిలువరించట
యెవరువచ్చినదారి పోయెదరు వారు.

కలుషమతిని నేఁగానో! యగ్గలపుఁ బ్రేమ-
ఫలముఁ గోరని ప్రేమ- నాపైనఁ జూపు
నామె కాంత్యమ్మునందు సాయమ్ము సేయ
నకట! తుదిచూపుకైన నోచుకొననేన.

ఎంతబుణ్యక్షేత్రములకును లభింపనట్టి
పుణ్యమబ్బె, నేకాదశీపుణ్యతిథులఁ
దనువు విడుచుట- వైకుంఠధామమందు
హరిపదమ్ములకెలన నిల్తురోకో యేమొ?

*  *  *  *  *

మరణము సర్వజీవులకు మానఁగరానిది; యెవ్వరెంత సుం
దరులయినన్, గళానిధులు, ధార్మికులైనను, బాపులైన, న
శ్వరమగు జీవితమ్ము విడి చావవలెన్ మఱి నేఁడొ రేపొ! హా
యిరనుచు నేస్తులందఱు వచింపఁగఁ దార వివేకలోటచే.

ఏనిటఁగూఁకుచున్న ధరణీతలమందున, నెన్ని సౌఖ్యముల్
భానుసమప్రభన్, మిగుల వన్నియకెక్కెనొ? యెన్ని [యుద్ధముల్
గానఁగనయ్యెనో? పురవరమ్ముల వెన్ని వెలింగెనో- [శవమ్ములన్
దానిట నెన్ని కప్పెనో? విధాతయె రాని, వచింపనేర్చునే?-

ఎంతయుఁగళావిహీనమయి యిచ్చట యీకనుపించుపల్లె, యే
లలితకళానిధానమయి రాజిలు పట్టణమయ్యెనొక్కొ ము

న్న లఘుపరాక్రమ క్రమగుణాలయులైన మహీశులెందఱో
స్థలమునఁ బుట్టి తేజరిలి చచ్చిరో?- యెవ్వఁడు చెప్ప
నేర్చెడిన్?

కష్టములందు నెంచక, సుకర్మల కానవహించఁబోక, సం
తుష్టిముఖాంబుజంబులసుదోప, హలమ్ముల నెడ్లతోడ, నే
సృష్టి మెఱుంగకే పొలముదున్నుచు జీవము వెళ్ళబుచ్చి యా
కాష్ఠములందు మేనువిడి, కర్షకు లెందఱుపోయియుండిరో!

అరుణకాంతులు దిక్కులంవలముకమున్న
వలరి మేల్కాంచి కాల్యములదీర్చి,
విమలకాళింగి పవిత్రతోయమ్ముల
మునిఁగి సాంధ్యక్రియఁబూర్తిఁజేసి,
ధరియించి విమలవస్త్రమ్ములు భక్తి చె
న్నలరఁగా దేవాలయమ్ముఁజేరి,
నవునగా సౌందర్యవల్లీమనోహరుఁ
డాది తొంటఁబడు సాష్టాంగమెఱఁగి,

పరిస్తుతులుసల్పి, పాటలుపాడి, పిదప
వేదపారాయణమ్ములఁ బ్రియము నెఱపి

ఎందరోభ క్తులిక మునుపీ స్థలమున
దీర్ఘ నిద్రను జెందిరో తెలియదు వశమె?

అందమువల్లనో యభినయమ్ములనో వివశాత్ములై. వెతల్
జెంది, గడించునాత్మగౌరవమొ, లేక ఋణమ్మొ, యొసంగి వేశ్యక
సుందరియైన యాలిపయిఁ జూపయినన్ మతిలేక భ్రష్టులై
యెందఱువారి దేహముల నిధరయిత్రికి నప్పగించిరో?

తొలిజాము కోడికూతలు చుక్కతళతళల్
కలపఁగా లేవ్రువారల సుషుప్తిఁ
బురుషోత్తమునిముందు ముట్టించుహారతుల్
జెలుపవువారి, నిద్దురులనిపుడు
లలితకలక్వణమ్ములు దరహాసముల్
తాకవువారి నిద్రానురక్తి
అంగనాసేవితుఁడగు హరివిభవముల్
చేరవు వారల చిత్తసీమ

మృగశిరార్ద్రి పరివేశముల్ లేనివాన
లింక వారి మోదమ్ము హరించలేవు,

"మఱి యొకనిఁగూడెఁ దనవేశ్యమణి యితన్ను"
అనుటలును వారిజీవముల్ గానఁగ లేవు.

ఒకనాఁడు- అలసియింటికివచ్చువాఁగని ద
ప్పనఁజూచి యెదురువచ్చినదిభార్య
ఒకదినమ్మున గరుడోత్సవమ్మునఁ దన
పైఁబడినది మతాబాల వెలుఁగు,
ఒకనాఁడు ప్రేమ నింటికివచ్చువగకాని
నక్కునజేర్చె వేశ్యాలతాంగి
ఒకనాఁడు తనయెద నుడికించువగల న్రి
చ్చినది శ్రీహరి తులసీదళమ్ము

ఒకదినము తనదగ్గఱకుఱికి కాళ్ళు
కౌఁగిలించుకొన్నారు చక్కనికుమాళ్ళు
ఒక్కనాఁడు వేశ్యమాత యుఱిమిచూడ
విన్నదనముతోఁడుత నిల్లు వెడలినాఁడు.

కోర్కెయును భోగమును రెండు కొలువుదీఱ
యీయమాయికప్రేమల, నీవిముగ్ధ

విభవములఁజూచి, నవ్వుట విడచుఁగాక,
భోగములుకూడ నశియించి పోవాయేమొ!

ధరణిజనించినారు, సుకృతమ్ము, దుఃఖమ్ము కో జీవితమ్ములన్
సరసముతోడ నీడ్చిచనినారు, మరేమిటికీర్తియున్నదే?
చరితము భూమిపైనిలుపఁ జాలఁగ నెద్ది యొనర్చినారొ చె
ప్పరే, యని, నవ్వబోకుమిటు, వారలఁజూచియు కీర్తి
[కామినీ!

ఏరీ చెప్పుము నీవు వేళ్ళెల్లడచి? యేడీ యాహరిశ్చంద్రుఁడే
డీ రాముండు? నలుండు నెక్కడ? మఱేడీ యశోకుండు? నేఁ
డా రాంజేంద్రుఁడు కృష్ణరాయుఁడెట? యున్నాఁడా శివాజీ!
[యిఁకే
లా? రప్పింపఁగ నేర్చునే చరితముల్ వారందఱిఁ
[ఖ్యాతులన్.

వీర్య, మతిశయ, మధికార, విలసనంబు,
భోగ, మందమ్ము, నశియించి, పోవాయేమొ?
కీరితి పథమ్ము కాటికిన్ దారిసుమ్ము!
దానినెంత యుత్తములైనఁ దప్పకొనరు.

మునునీమట్టికిఁ జెల్లెనేమొ? జగముల్ మోదింపరాష్ట్ర
[మ్ములన్
దనవికాంతికతమ్మునన్ నిలిపి, సౌందర్యమ్ము హెచ్చించి, చ
క్కని క్షేమంబొనగూర్చి పోషించిన మహాఖ్యాతుండు,
[కాదంచనో
యి! నరుండెవ్వఁడు పల్కనోపునకటా! యెప్పట్టనేమున్నదో?

పాపమీ యభాగ్యులకు విద్యాపురంధ్రి
సరిగఁ గాలంపుఁబుటల గన్పరుపలేదు,
చల్లని దరిద్రదేవత యుల్లమడచి
కరుడుగట్టించినది వారిగౌరవమ్ము.

జలధిలోపల నెన్ని జాజ్వల్యమాన
తళతళద్యుతి నలరురత్నములు లేవు?
గహనముల నెన్ని యెవ్వరికనులబడక
విమల పరిమళాన్వితములు విరులు లేవు?

తనపురమ్మున దౌష్ట్యమ్ము నణఁగఁద్రొక్కి
వెలయు నభిమన్యులును, మఱి పలుకరాని

కాళిదాసుఁ, మఱిశివాజీయు, నెంద
ఱిచట విశ్రాంతిఁ జెందిరో యెవరికెఱుక?

అరులఁ గలఁగించి సభల నందఱనుమించి
పారవశ్యమ్ముఁ జేకూర్చి ప్రజకు దేశ
భక్తి నెఱిఁగించి, స్వారాజ్యపథము ద్రొక్క-
భాగ్యమది వీనొసటిపై వ్రాయఁబడదు.

అతిథియే కాదు బంధులనడఁచి ఘోర
హత్యలనొనర్చి- కావ్యకన్యకను జంపి,
దేశమునకు సంకెలవేయు ధృష్టగుణులు
గూడ నిద్రారు తెలియుఁడీ చీడమట్టి.

నాగరికంధవర్తనమునన్ జనియించెడి వెఱ్ఱిత్రోవ కెం
తేఁగదు దూరమందున జరించి ముగించిరి జీవనమ్ములే
లా? గుణముల్ దలంపఁగ ననంతయులాభముకల్గునే,యి దే
యూగిరె? కృద్ధియేసలిపె నంతిమశిక్షను వీరికిన్,గదా!

* ♦ * * *

చల్లపడినవి వలువలు- చందమామ!
యీవునాపయి జాలి వహించియేడ్వఁ
బోవుగా! యివి బాష్పముల్ గావుగా! ని
జమ్ము!- ఒకఁడైన నాపయిఁ జాలిగొనెనె?-

వలపులే[illegible]కు వెఱ్ఱెత్తి వాగుచుంటి
వలపువలపయ్యొ జాలియెవ్వరికిఁగూడ
స్వేచ్ఛగానన్ను నేడువ నిందుజాలు
అదియె పదివేలు, పలికించకయ్యనన్ను!

తెలిసెం దెల్సెను నాకుఁజంద్ర! మఱియేదీనీకు మాత్రమ్మువ
వలనన్ మోదముకల్గు, నొక్కఁడవు,-పో,! స్వాతంత్ర్యమా? [దానిన్
కలనైనన్ దలపోయఁబోలదు విసుంగా లేక విశ్రాంతియో
నిలువన్ జెల్లునె యొక్కచో నిముసమేనిన్? కృష్ణకృష్ణా [యికన్?

పలికెను వారిమాట! సరిపల్కఁగఁ దీటికయేది? యొక్కచో
నిలువఁగఁజెల్లునెట్లు? ధరణీసఖకీవు ప్రదక్షిణమ్ములన్
సలుపవలెన్గదా! నినువిచారణచేసెను వారలుంచిరా!
వలదురయిట్టిబాధ పగవానికిఁగూడ, యెటుల్ సహించెదో?

ఊఱుకవలెన్ సరే,- యాయిననున్న దెవారి? నిరామయ
[మ్మునన్
బఱఁగిడు టెట్లు?- పాదముర సంకఁగ జారిన లాభమున్న దే?
అర సెడువారు లేరు, ప్రియమ్మునఁ జూచెడువారు లేరు బా
పు రె! తలిదండ్రులైనఁ గనఁ బోమయయో! యిటులేచ్చ
[ మంటివా?

అయినన్ నీకుదగొంత మేలుగద చంద్రా!పోవు కార్యమ్ము కా
ని, యిఁకే కార్యము నీకు లేదుగదరా! నీయేకు పేకాని నీ
పయి నింకొక్కరి భారముండదుగదా! పై నుండియున్
[భూమిన
న్నియు వింతల్ గనుఁగొందు వే, కుదియొకింతేన్ నీకు మేల్గా
[దోకో?

గురుసతినింపు జన్వానముకున్ గమధన్యత యబ్బెనఁట నీ
వరణమున్ గదా! మిగులివన్నెలు చిన్నెలు చూపు తారకా
తరుణులు నీదుకూడిక సతమ్మును గోరుదురంట కాద! యా
దరయుఁగ రోహిణిన్ మిగుల నర్మిలి జూతువటంచు కేళశీ!

మొగమున రంగు బాగుగను బూసినవారలు, సోయగమ్ములన్
జిగిబిగులన్ దళత్తళల నేర్పు చూపెడువారు, మించుచూ
పుగముల నందమొల్క విరిబోడులమూక వసించువీథులన్
మిగులఁ బరిభ్రమింతువట, నీవును నిత్యముఁ దార కావళిన్

కాంతారత్నములన్ సఖీమణులఁ, శృంగారాంగులన్, రామలన్
చింతాపీడల నుజ్జగించి యెపుడున్ వీక్షింపవో? భూమినా
వంతేనోర్మిముగ దల్పకుండ పటుమోహాత్ముండవై? దానవు
స్వాంతుండీ శశియుంచుఁ బల్కను శశీ! సఖ్యమ్ములా
[యీకతల్?

రసికుడవీవు, ప్రేమయాలరారఁగ రామలతో విలాసముల్
ముసిముసి నవ్వులున్నలిల ముఖ్యవిహారము లుల్లసిల్ల సం
తసమున నుంటివెన్నయొకదా! క్షణమైనసుఖమ్ముగా మనో
వ్యసనము వీడియున్నను హిమాంశ! యదే పదివేలు కాదొకో?

కానీ, నీవటులుంటివన్న పలుకుల్ కాసంతయేన్ సత్యమా?-
నేనమ్మన్ హృదయమ్ము గాల్చెడు వ్యథన్ వీడల్ నిన త్రింతురం
చోనైర్మల్య రుచిప్రధానమ! మనుష్యుల్ "చూడ
[వ్యాఘ్రిమ్మనం

గా; నిర్మింతురు గాఢభక్తి తనపై నన్ దూఱకేసంచున్" ధరన్.

నిముసము మౌక్తికము దగ్గఱఁగ నిల్చుచు, దోఁచినమాటలాడి నిన్
దమకనువైనరీతి ని, జనమ్ములు "అంకుపురాణముల్" గవి
త్వముకకు సొంపుపెంపులును బాటిలగట్టుదు, రంతెకాని మో
మలరుచీ! యెఱుంగనొకొ ప్రీతినిమీకు నదెంతదూరమో!

తెలియని ఛాందసుల్ కవులు తెల్పఁగ వచ్చును నిన్ను "రోహిణీ
చెలికి నిగూర్చువాఁడవన్ని, శిష్యుఁడవై గురుకాంత బట్టి యా
ర్మిలియిడు సేరినాఁడవని" మేలుగఁ జంద్రికతల్లఁ జూడ న
వ్వాలని, మొదన్ బగుళ్ళవగపుల్ గలనిన్నెఱుఁగంగనేర్తురే?

ఎఱుఁగని బూధులేవో వచియింతురు "వాఁడిట్టుల్ల వెళ్ళఁగన్
తరుగనివంత, నేడు పకతమ్ముగ వంతయుఁ దోఁప" దంచు నె
వ్వారికగు నీయెడం దఁగడు వ్యాపృతినంచెన శోకకీలినిన్
దరియఁగ, నీవు మాత్రము వృథావచింపఁగనేల వారికిన్?

ఒక్కవెసఁగాల్చుచుండుఁగడ యుగ్రకరుండు సతమ్ము, నీవు చా
నక యసువుల్ వహించుటలు బాపురె చిత్రముగాదె!

[మొక్క...దా

నీకిసుఖనందు-, నీవయిన నీకు ద్వారన్ మరణంబురాదు,దుః
ఖకథలకేను వేగఁ దుదిఁగాంచెదఁ జావుఁ దెరో, యెప్పుడో

ఈయిలపై బ్రదుక్షణములెన్నో యొనర్చుచు నున్న వేళఁ నీ
నీయెదగాల్చు బాధలను నీవొకసన్న యెలుంగుతోడ చం
ద్రా! యిటు పాటసేసి, యనురక్తిని బాడుటలేనువిందునో
యీ! యెదనీరుగా, నితరులెవ్వరుచూడరు-పోని! నష్టమా?

మనముజనించినార, మనుమానములేని విచిత్ర దుఃఖజీ
వనమును నెత్తిఁదాల్చి; యిటువందిరినన్ ఫలమేమి? యెవ్వరున్
వినరవి-యందుపైఁగలుఁగ నేర్చెడియూరట,జూడమంచునా
కను మఱినీవు, నీవయినగోడు వినంగను నేను-నుంటిమా?

నాకుఁ దగదీజగముచంద్రా! రవంత
నీకడకుఁ దీసికొనిపోవె- నిర్జనమ్ము
లై శమించిన యగ్నిపర్వతములందు
మనము విప్పికొందము మనమునయెదలను-

ఇతరులుచూడకుండఁగను నెత్తుగోడలుచుట్టునుండవ
న్నత శిఖరమ్ములందొ, వడబావుల గట్టలనో యెథేచ్ఛగా

బ్రతికెనుదాక, సంకటపురాణములన్ బఠియించుచున్, శశీ!
వెతుకుద మెల్లిచోటులను విస్మృతమోద రహస్యసంస్థలన్

తనహృదయమునువిప్పి చెప్పిననుగూడ
నొక్కరైనను వినువారలుండఁబోరొ
యతనిమించఁగలుఁగు దుఃఖాన్వితుండు
లేఁడు- ముమ్మాటికిని లేఁడు- లేఁడు- లేఁడు.

# ఆశ వదలిన మొండిరోగములయందు
# "ప్రకృతి వైద్యము" రక్షించును.

## గ్యారంటీ వైద్యము.

సమస్త దీర్ఘరోగములకిది యొక్కటియే శరణ్యము. దీర్ఘరోగులకిదియే చివరవైద్యము. రోగులు మాయొద్దకు వచ్చినచో వారిశక్తిననుసరించి కట్నములు పుచ్చుకొని వైద్యము చేయుదుము. రాజాలనివారు మా "దీర్ఘరోగచికిత్సాసారము" అను ప్రకృతి వైద్యగ్రంథసహాయమున, తమంతటతాము చికిత్సపొందవచ్చును. దీనివెల ఖర్చులతోసహా రు 2—0—0 ప్రత్యేక సలహాలకు ఫీజు రు 5—0—0 లు.

డాక్టర్:— పాలపర్తి నరసింహారావు,
ప్రకృతివైద్యులు, వేటపాలెం.

సాహిత్యలత కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | వివేకానంద (నాటకము) | రు 0—12—0 |
| 2. | వ్యాసమంజరి | 0—12—0 |
| 3. | మల్లెపూలు (పద్యకావ్యము) | 0—12—0 |
| 4. | ఆంధ్రదేశము (సాంఘికనవల) | 0—12—0 |
| 5. | డిటో రెండవభాగము | 0—12—0 |
| 6. | ప్రణయసామ్రాజ్యము | 1—0—0 |
| 7. | శాంకరసంగమము (పద్యకావ్యము) | 1—0—0 |
| 8. | శారి (పద్యకావ్యము) | 1—0—0 |

శ్రీ హనుమాన్ ఆయుర్వేద & హోమియో

వైద్యశాల, చీరాల.

"ఆయుర్వేద వైద్యరాజ"

డాక్టర్: పోట్లూరి చెంచుపున్నయ్యపంతులు.

పక్షవాతములకు ప్రధాన చికిత్సకులు.

అతిశీతవాతములకు అతినిపుణతతో శాస్త్రీయముగా చికిత్స చేయబడును. పక్షవాతము ఏ స్థితిలోనున్నను శాస్త్రీయ చికిత్స చే బాగు చేయుదురు.

హోమియోపతి, నాచురోపతి, డయ్యాటక్ పతి, క్రోమోపతి, ఎలెక్ట్రోపతి మొదలగు చికిత్సలచే సమస్తవ్యాధులకు సక్రమమైన చికిత్స చేసి బాగుచేయబడును. ఎటువంటి మొండి వ్యాధినైనను త్వరితముగ కుదుర్చగలరు. గ్యారంటీ చికిత్సాలయము యిదిఒక్కటియే. వివరములకు వ్రాసిన తెలుపబడును.

డాక్టర్: పి. వి. సుబ్బారావు, హెచ్. యం. బి. చీరాల.

యం. అండ్ యస్. రైల్వే.

సర్పవిషాంతకం:— కీళ్ళనొప్పులు, పోటులు, బొబ్బలు మొదలగు సర్పరోగములు ఎంతఘోరముగానున్నను, ఒక వారమునకే తప్పక గుణమిచ్చును. గ్యారంటీమందు.

ఒక వారమునకు సరిపోవుమందు **2—8—0**

# "మల్లెపూలు."

గ్రంథకర్త:— కృష్ణరావు.

విలువగల గ్లేజుకాగితములపై పంచవర్ణముల ముద్రితము,
చిత్రపటశోభితము.

"......మీ మల్లెపూలు సహిత మకరందయుత
ములై యుండుట అతిశయోక్తిగాదు......"

(కవికోకిల, దు. రామిరెడ్డి.)

"మల్లెపూలు పూర్తిగా చూచినాను. భాషయును
భావములును గూడ రమ్యముగనున్నవి, రంగులును తావియును
గల విరులవలె మనోహరముగనున్నవి......"

(పున్నవ లక్ష్మీనారాయణ)

"......మల్లెపూలు అను భావగీతికల సంపుటి చదివి
ఆనందించితిని. లలితమగు భావములు, భావములకుతగిన సరళ
మగు భాష యీగ్రంథముయొక్క ప్రత్యేకత. సౌందర్యసువాస
నల సమ్మేళనమేగదా మల్లికాప్రసూనములు. ఆంధ్రభాషా
కన్యయొక్క సూక్ష్మకవితావేణిని అమ్లానమగు "మల్లెపూలు"
శాశ్వతముగ అలంకరింపగలవని పూర్ణవిశ్వాసము......"

వెల 0—12—0. (బెజవాడ గోపాలరెడ్డి)

రాబోవు గ్రంథము:—

# “ చతుర్థి. ”

గ్రంథకర్త:

ఐ. రంగనాయకులు, ఎమ్. ఏ.,


శ్రీ పాండురంగ ముద్రాక్షరశాల,

చీరాల